# నవ నాటికలు

తొమ్మిది సుప్రసిద్ధ ఆధునిక
తమిళ నాటికల అనువాదాలు


సంకలనం:

మీ. పా. సోమసుందరమ్

అనువాదం:

'శ్రీవాత్సవ'






దేశికవితా మండలి, విజయవాడ-2

First Edition: 5,000 Copies
Aprial 1960

# NAVA NAATIKALU

Telugu Translation of
NINE ONE - ACT PLAYS FROM TAMIL

Compiled by :
P. SOMASUNDARAM

Translated by :
'SREEVATSAVA'



PRICE: 1 - 65

Published under the auspices of the
Southern Languages Book Trust - Madras.
TELUGU—54.

PUBLISHED BY:
DESIKAVITA MANDALI,
VIJAYAWADA - 2

# పరిచయము

ప్రజాసామాన్యానికి ఆకర్షణీయంగా, విశేషోపయోగకరంగా ఉండే పుస్తకాల ప్రచురణకు దోహదం చెయ్యాలనే సంకల్పంతో దక్షిణ భాషా పుస్తకసంస్థ లోగడ కొన్ని పుస్తకాలను ప్రచురింప జేసింది. ఆ ప్రచురణలవలన కలిగిన అనుభవంతో ఇప్పుడు మరికొన్ని పుస్తకాలను వివిధ ద్రావిడ భాషలలోకి అనువాదం చేయించి ప్రచురింప జేస్తూంది. పాఠకులలో భిన్న భిన్న అభిరుచులకు తగినట్టు ఈ పుస్తకాలను శ్రద్ధగా ఎన్నిక చేశారు. అందువల్ల మానవ జీవితానికి సంబంధించిన వివిధ విషయాలనుగురించిన రచనలు ఇందులో ఉండటం సహజం. భారత మహానాయకుల జీవిత చరిత్రలు, వారు చేసిన ఘన కార్యాలు వివరించే గ్రంథాలు ఈ ద్వితీయ గ్రంథ పరంపరలో ఒక శాఖ. మన దేశ శ్రేయస్సుకోసం, అభ్యుదయంకోసం ఆ మహాపురుషులు ఏమి చేసినది, వారికి మనము ఎంత ఋణపడి ఉన్నది, ప్రజలకు ముఖ్యావశ్యకములైన హక్కులను సంపాదించటానికి వారెన్నెన్ని పాట్లు పడినదీ ముందు తరాల వారంతా తెలుసుకుని ఉండటం మంచిది.

తత్త్వశాస్త్రం, మతం, విజ్ఞానశాస్త్రం, సాహిత్యం—ఈ గ్రంథ పరంపరలోని ఇతర శాఖలు. కథానికలు, ప్రాచీన కళా సంపదలను అభివర్ణించే గ్రంథాలు కూడా ఇందులో ఉండడం ముదావహం. నాటకకళ, శిల్పశాస్త్రం, పురావస్తు పరిశోధనలు, నిరతాద్భుతావహములైన దాక్షిణాత్య దేవాలయాలను గురించిన గ్రంథాలు ఈ పరంపరలో ఉన్నవి. విజ్ఞాన వికాసదాయకములైన భిన్న భిన్న విషయాలను గురించిన ఈ

గ్రంథాలు ప్రజలను విశేషంగా ఆకర్షించ గలవని. ఆ విధంగా ఇట్టి ప్రచురణలకు ముందు విస్తార ప్రచారం కలుగగలదని నా విశ్వాసం.

దక్షిణ భారత భాషలలోని ఉత్తమ గ్రంథాలు కొన్నిటిని మిగిలిన దాక్షిణాత్య భాషలలోకి అనువదింపజేయటం ఈ ద్వితీయ గ్రంథ పరంపరలోని మరొక ప్రశంసనీయమైన విశేషం. ఈ పుస్తకాలన్నీ పూర్తిగా వెలువడినప్పుడు, విద్యావంతులలో ఎక్కువ మందిని వివిధ విషయాలను గురించిన జ్ఞానాసక్తిగల పాఠకులనుగా ఆకర్షించి, ఆ జ్ఞాన పిపాసను తృప్తి పరచటానికి యోగ్యమైన గ్రంథాలనుకూడా వారికి అందజేసినట్టు అవుతుంది.

ఈ దక్షిణ భాషా పుస్తకసంస్థ ఆశయాలు శీఘ్రగతిని సఫలం కాగలవని ఆశిస్తున్నాను.

మద్రాసు,
7-10-1958

ఇట్లు,
డా॥ ఎ. ఎల్. మొదలియార్,
వైస్ ఛాన్సెలర్,
మద్రాసు విశ్వవిద్యాలయం.

# మున్నుడి

తమిళంలో ఏకాంక నాటికలు సుమారు నలభై సంవత్సరాల క్రితమే వచ్చినవని చెప్పవచ్చును. అంకము అనే శబ్దము ఉత్తరాదినుండి వచ్చిన దనవచ్చును. పూర్వకాలంలో సంస్కృత నాటకాలన్నీ అంక విభజనతో వ్రాసినవే. అయిదు అంకాలయినా ఉంటేనే వానికి నాటకములు అని పేరు. అంతకంటే తక్కువ అయితే వాటిని నాటికలు అని పిలిచినట్లు ఒక నాటకలక్షణగ్రంథంలో వ్రాసివున్నది. ఆ కాలంలోనే సంస్కృతములో ఏకాంక నాటకములున్నవి. వానిలో ఎక్కువ భాగము ప్రహసనములే (నవ్వు పుట్టించే చిన్న నాటికలు) ఉండేవి.

కొన్ని శతాబ్దాలకుపూర్వం అచ్చు అయిన తమిళ సంగీత నాటకములు చూస్తే, అంకము అనే విభాగమేలేదు. ఉదాహరణంగా మార్కండేయ నాటకము, అరణ్య నాటకము, ద్రౌపదిస్వయంవర నాటకము, మొదలైన నాటకములలో అంక విభజనేలేదు. కథ ఒక చోటునుండి మరొకచోటుకు మార్చవలసివస్తే, వచనములోనే సూత్రధారుడు చెప్పేవాడు అని మనము గ్రహించవచ్చు. ఉదాహరణముగా "వీరకుమారుడు తన తల్లివద్ద సెలవు తీసుకొని దిగ్విజయము చేసిన విధము ఎట్టిదనిన..." అని సూత్రధారుడు పలికిన ప్రకారము చూడవచ్చును.

రాత్రి తెల్లవార్లూ ఆడవలసిన హరిశ్చంద్ర విలాసము మొదలైన నాటకములు ఉన్నప్పుడు, ఏకాంక నాటికలకు ఎక్కడ సావకాశము? అయితే కొన్నిశతాబ్దాలక్రితం వచ్చిన "కురవంజి" నాటకము "నొండి" నాటకము మొదలయినవి తమిళములో వచ్చిన ఏకాంక నాటకములని మనము చెప్పవచ్చును, వీనిలో జరిగిన కథావృత్తాంతము, అభినయము అంతా ఒకే ఒక స్థలంలో జరిగేవి, స్థలం మార్చులేదు.

1862 నుండి వచ్చిన నాటకములు ఉత్తరాది నాటకములను అనుసరించి వచ్చినవే అనవచ్చును. ఇవి ప్రదర్శించడానికి మూడు నాలుగు గంటల కాలం వరకు పట్టేది.

సంస్కృతములో వచ్చిన ఏకాంక నాటికలవంటి తమిళ నాటికలు మొట్టమొదట నలభై సంవత్సరాల క్రితం వచ్చిన వనవచ్చును.

వానిలో తొలినాటిక "సభాపతి" అనే హాస్య ప్రధానమైన చిన్న నాటిక అనుకొంటాను. దాని తరువాత, బడులలోనూ కళాశాలలలోనూ వార్షికోత్సవాలలోనూ విద్యార్థులు ప్రదర్శించడానికి, నవరాత్రులలోనూ పండుగలలోనూ ఆడుకోవడానికి వీలైన అనేక ఏకాంక నాటికలు వచ్చినవి. మన దేశంలో ముప్పై సంవత్సరాల క్రితం రేడియోస్టేషన్లు పెట్టిన తరువాత, దానిమూలంగా ప్రసారం చేయడంచేత తమిళంలో అనేక ఏకాంక నాటికలు వచ్చాయి. తమిళంలో మద్రాసు, తిరుచినాపల్లి రేడియో కేంద్రాలనుండి వారానికి రెండు మూడు క్రొత్త ఏకాంక నాటికలు ప్రసారం కావడం చూచి తమిళంలో చిన్న చిన్న పిల్లలు కూడ ఏకాంక నాటికలు వ్రాయడం సర్వ సాధారణం అయిపోయింది. అందుచేత ఈ కాలంలో చిన్న నాటికలు వందలకొద్దీ వస్తూవున్న వనడానికి సందేహము లేదు.

ఈ కాలంలో వస్తూవున్న నాటికలలో ఎక్కువ భాగం సాంఘిక నాటకాలే అనవచ్చు. ఇప్పుడిప్పుడు తమిళంలో క్రొత్త క్రొత్త ప్రయోగాలు జరుగుచున్నవి. సంఘంలో ఎన్నో మార్పులు వస్తున్నవి. ఆమూర్పులు నాటకములలో సాంఘిక సమస్యలుగా రచయితలు చిత్రిస్తున్నారు. అయిదు అంకాలు గల నాటకములో ఒక విషయమును గురించి చక్కని వివరములతో విపులంగా వ్రాయవచ్చును. అదే విషయం తీసుకొని రెండు మూడు రంగాలలో దానిని వ్రాయడం అంత సులభం కాదు. సూక్ష్మంగా చెప్పడం ఎప్పుడూ కష్టమే.

పైన చెప్పినట్లు, వందలకొద్ది వస్తూఉన్న తమిళ నాటకములన్నీ పరిశోధనచేసి, దానిలో ఉత్తమమైన నాటికలు ఎన్నుకొని వాటిని సంకలనం చేయడం కష్టం. ఈ కార్యం ఎక్కువ సమర్థతతో చేసి ఈ నాటికలు ఎన్నిక చేసినవారు శ్రీ మీ. పా. సోమసుందరమ్‌గారు. వారి కృషిని నేనెంతో ప్రశంసిస్తున్నాను. దక్షిణభారత పుస్తకసంస్థవారి యాజమాన్యంక్రింద ద్రావిడ భాషలన్నింటిలోనూ ఇటువంటి చక్కని పుస్తకము లెన్నో వెలువరుస్తున్నారు. ఈ కార్యం చేపట్టిన ఈ సంస్థవారిని దక్షిణభారతభాషల అన్నింటిపక్షమున నేను ప్రశంసించకుండా ఉండలేను.

— టి. సంబంధమ్.

# పీ ఠి క

ఈ కాలములో చారిత్రకముగా నిజమైన సంగతి చెప్పినప్పటికీ నమ్మకుండాఉన్నారు. ఏ విషయానికీకూడ ఒక్కొక్క దానికి ఒక్కొక్క కక్షి యేర్పడిన కారణముచేత నిజము చెప్పినప్పటికీ, దానికి అపార్ధంకల్పనచేసి పలకడం ఒక పద్ధతిగా ఏర్పడింది. రెండువేల సంవత్సరాలకు పూర్వమే తమిళనాడులో నాటక కళ ఉన్నత స్థితిలో ఉన్నదని చెప్పితే ఇదేదో గొప్పకోసము చెప్పినదని అనేవారున్నారు. కాని తమిళ భాషలోని 'తొల్ కాప్పియమ్' అనే లక్షణగ్రంథములోని కొన్ని సూత్రములు చూస్తే, ఆ కాలములో నాటక కళ తమిళనాడులో వర్ధిల్లినట్లు ఆధారములు దొరకవచ్చును.

తమిళనాడుతో అనేక శతాబ్దాలకు పూర్వమే నాటక కళ వర్ధిల్లినట్టు చెప్పిన గ్రంథాలు చాల వున్నవి.

ఇటీవల తమిళభాషలో వచన గ్రంథాలకు ప్రాధాన్యంవచ్చిన తరువాత, ఒక క్రొత్తవెల్లువగా రచనలు వచ్చినవి. అప్పటినుంచి వచన గ్రంథాలుకూడ దాచుకోవాలనేఅలవాటు మనలో హెచ్చుతూ వచ్చినది. పూర్వకాలములో ఒకరినోటనుండి ఒకరినోటికి చెప్పడంద్వారా ఆ నాటకాలు ప్రచారంలోకి వచ్చేవి. ఆ కారణముచేతనే అప్పటి తమిళ వచన గ్రంథాలు మనకిప్పుడు దొరకకుండా పోయినవి.

'తొల్ కాప్పియమ్'లో "మెయ్ పాట్టియల్" అనే అధ్యాయం చదివితే తమిళుల నాటక పరిజ్ఞానము, శిక్షణ ఎంతవరకు ఉన్నదో బోధపడుతుంది. "మెయ్‌పాట" అనే మాటలోనే ఈ సత్యం అవగాహన అవుచున్నది. 'తొల్‌కాప్పియమ్' గ్రంథం రావడానికి ముందే నాటకకళ అద్భుతముగా వర్ధిల్లినదని చెప్పడానికి లక్షణ గ్రంథములలో అనేకాధారములెత్తి చూపవచ్చును. ఇప్పటికి కూడ నేర్చుకోవడానికి వీలయిన విధములో అంతా సవిస్తరముగా వ్రాయబడి ఉన్నవి.

నాటకము నిర్వహించే సూత్రధారుని గురించి, ప్రయోక్త ఉపయోగించే సామగ్రి- మొదలయిన వానిని గురించి ఒకపద్యములో చెప్పి, వీనినినేర్చుకోవడానికి నాటకలక్షణ గ్రంథములు చూడవచ్చునని అన్నారు. ఆకాలములో అన్ని నాటక లక్షణగ్రంథము లున్నవని దీనినిబట్టి గ్రహించ

వచ్చును. "పెయిత్రినార్" అనే వ్యాఖ్యాత "మెయ్‌పాడు" అనే దాని లక్షణము చెప్పినాడు. "వాస్తవమునకు అనుకరణగా అభినయించడమే మెయ్‌పాడు" అని అన్నాడు. ఇవన్నీ ఉదాహరించుటలో ఉద్దేశము, తమిళనాడులో చాలకాలం క్రితమే నాటకకళ వృద్ధిఅయినదన్న విషయం మరచి పోకూడదని చెప్పడానికే.

ఇంత పురాతనమైన యీ కళ పాశ్చాత్య ప్రభావము చేత క్రొత్త క్రొత్త రూపులతో వర్ధిల్లినది. పెద్ద పెద్ద దృశ్య నాటకాలు రచించడానికే అలవాటు పడిన రచయితలు, రేడియో వచ్చిన తరువాత చిన్న నాటికలు వ్రాయుటలో కృషిచేశారు. అలాగ వచ్చిన క్రొత్త నాటికలే యీ సంకలనములో చేర్చినాము.

నవీన నాటకములలో మంచివన్నీ యీ సంకలనములో చేర్చబడినట్లు తలంచకూడదు. ఇంకను ఇట్టి సంకలన గ్రంథములు అనేకం రావడానికి మొదలుగా దీనిని భావించ వచ్చును. చేర్చాలని ఉండి చేర్చడానికి వీలులేక, అనుమతి యివ్వక, ఇంకా కొన్ని కారణాంతరాలవల్ల ఈ సంకలనములో చేరక ఉండిపోయిన నాటకములు కొన్నిఉన్నవి. అవీ, యింకా మరికొన్నీ. తమిళ ప్రచురణలలో క్రొత్త సంకలనములలో ముందు ముందు రాగలవని నా నమ్మకం.

ఈ సంకలనమును దక్షిణ భాషా పుస్తక సంస్థవారి యాజమాన్యం క్రింద "పొత్రామరై పదిప్పకమ్" అనే ప్రచురణ సంస్థవారు మొదట తమిళములో ప్రచురించారు. ఈ సంస్థవారికి నా అభినందనాలు తెలుపుచున్నాను.

ఈ నాటక సంపుటి ఒక పుష్పమాల. ఒక్కొక్క పుష్పము ఒక ప్రత్యేక సౌరభంతో కూడి యున్నది. సంకలనము ఏది చేసినా, అందులోని అన్నిపుష్పాలూ అందరికీ నచ్చేటట్టు చేయడం సాధ్యంకాదు. అయినప్పటికీ ఒక్కొక్కరికి నచ్చేవి ఒకటి రెండు పుష్పాలయినా ఒక మాలయి ఉంటే, అది ఆ మంజరికి శ్రేష్ఠత సంపాదించి పెడ్తుంది. ఇదిగో పూలదండ. మీ చేతిలో ఉంచుతున్నాను. ఈ పుష్పమంజరిని సుకుమారంగా చూచుకోవాలని వేడుకొంటున్నాను.

చెన్నపట్నం,
12–6–58.

మీ. పా. సోమసుందరమ్.

# అనువాదకుని మాటలు

దక్షిణభారత భాషా సంస్థవారు స్థాపించిన బుక్ ట్రస్ట్‌లో తమిళ, కన్నడ, మళయాళ, తెనుగు భాషలలో అనేక పుస్తకాలు ప్రచురించారు. వాసిలో ముఖ్యమైనవి ఆయాభాషలలో ఉత్తమమైన కథానికలు, నాటికలు, కవితలు సమకూర్చిన సంపుటాలు. ఈ సంపుటాలలో నాటికల సంపుటాలు కూడ నాలుగు భాషలలోనూ వచ్చాయి. ఈ పుస్తకాల ప్రచురణలో ఒక భాషవారి సాహిత్యము మరొక భాష వారికి పరిచయం చేసే నిమిత్తం అనువాదాలు కూడ ప్రకటిస్తున్నారు. అటువంటి ప్రచురణలలోనే ఇదొక సంపుటము. ఇది తమిళంలో వెలువడిన పది నాటికల సంకలనము. దీనిలో ఒకటి విడిచి తొమ్మిది నాటికలు ఈ గ్రంథ రూపములో తెలుగులో వెలువడు చున్నవి. ఈ తొమ్మిది నాటికలలో ఎక్కువ రేడియో కోసము వ్రాసిన శ్రవ్యనాటికలుగా తోచవచ్చును. ఒకటి రెండు దృశ్యనాటికలు కూడ ఉన్నవి. మొదటి నాటిక 'సౌందర్య వ్యామోహము' ఒక చిత్రకారుని ప్రేమకు సంబంధించినది. కాలేజీలో చదువుకొన్న ఆధునిక యువతి అతనికి చక్కని గుణపాఠం నేర్పిన ఇతివృత్తం నిశితంగా చిత్రించారు.

రెండవ నాటిక 'కడసారిపిల్లవాడు' అనే దానిలో కొంత చమత్కారమూ కొంతసత్యమూ మేళవించి హాస్యముగా జ్యోతిషం నిజమైన విధానంగా చూపబడినది. దీనిలో భోజన

యోగంగల జాతకుడు ఎలాగ ఆ యోగం పొందినదీ చిన్న చమత్కృతిలో నాటకకర్త చూపించాడు.

ఇంక మూడవ నాటిక 'ధర్మపరీక్ష' ఏదిసత్యం ఏద సత్యం అని శ్రీ శ్రీ వ్రాసిన గేయాన్ని జ్ఞప్తికి తెస్తుంది.

నాలుగవ నాటకము ఒక ముప్ఫైరూపాయల నెలజీత గాడు, షావుకారు గుమాస్తా నిత్యజీవితంలో ఆడుతూఉన్న నాలుగు స్థంభాల ఆట జాలిగా చిత్రించింది. ఈ నాటకకర్త పుదుమైపిత్తన్ కీర్తిశేషుడైన ఉత్తమ కథకుడు. ఐదవదానిలో పిల్లల్ మన స్తత్వాలు పరిశోధన చేస్తూ, పెద్దల కక్షలతోనూ కట్టుబాట్లతోనూ పిల్లల మనస్సు లెలాగ మారిపోయేదీ ఋజువుచేశాడు-పిల్లల సాహిత్యంలో కృషిచేసిన నాటకకర్త శ్రీవల్లియప్పన్.

'ఓటమి' అనేనాటకము చరిత్రాత్మకకథనే తీసుకొన్న ప్పటికీ గాంధీసూత్రమైన అహింసా విధానానికి ప్రాధాన్య మిచ్చింది. 'తీయనితలంపు' మనోవిజ్ఞానానికి సంబంధిం చిన నాటకము. యుద్ధంలో చనిపోయిన కొడుకుకోసం బెంగపెట్టుకొని ఉన్మాదావస్థలో తీయని తలంపులో క్రొత్త ఆనందం సృష్టిచేసుకొన్న ఒక ముసలాయన మనస్తత్వము చక్కగా చిత్రించారు. ఎనిమిదవ నాటిక వ్యంగప్రధానమైన హాస్యం. ఈనాటిక తమిళ ఫిల్ములలో వినేసంభాషణలమీద, వాటి భాషమీద చిన్న విసురు. చమత్కారంగా ఉంది.

ఇంక చివరినాటిక దీపావళి పండుగకు తమిళ కుటుం బాలలో జరిగే కొన్ని లాంఛనాలు చిత్రించింది. పెళ్ళయిన సంవత్సరం దీపావళికి అల్లుడుగారిని పిలిచి, ఆయన కోరిన

కోరికలన్నీ తీర్చి బహుమతులు ఇవ్వడం—ఇదీ సంప్రదాయం. దీనిని చిత్రించడంలో నాటకకర్త ఆ సంప్రదాయాలూ అవీ కళ్ళకు కట్టినట్లు తీసుకొని వచ్చారు.

ఒక భాషలోని సొగసు నుడికారము మరొక భాష లోకి రావడం కష్టం. అనువాదంలో మాతృకకు అన్యాయం జరగకుండా అందలి అందమంతా తెచ్చే ప్రయత్నం చూపిం చాలి. ఈ ప్రయత్నం మాతృకకు ఒక్కొకచోట మసక గానూ మరొకచోట మరీ వెలుగుతోనూ కనిపిస్తుంది. ఐతే, ఈ అనువాదాలు స్వీకరించ వలసినవారు, మాతృకతో పరి చయంలేని తెనుగువారు. ఆ రకం పాఠకులకు ఈ అను వాదాలు తెనుగు రచనలలాగ కనిపిస్తే అనువాదకుని శ్రమ ఫలించినట్లే. మాతృక రచించిన నాటకకర్తల భావాలు పొల్లుపోకుండా, మక్కికి మక్కి కాకుండా తెనుగు రచన జరి గింది. అది యెలాగ ఉన్నదీ నిర్ణయించ వలసినవారు సహృ దయులగు పాఠకులు. ఈ సంకలన కర్త అన్నట్లు, రకరకాల పూవులతో కూర్చిన పూలదండ ఇది. ఇవన్నీ రకరకాల సువాసనలతో మనస్సు లోగొంటున్నాయి. వీనిలో రెండు మూడు నచ్చినా, ఈదండకు ఎక్కడలేని పరిమళం వచ్చినట్లే. ఈనాటకాలు చదివితే తమిళసాహిత్యంలో ఏకాంక నాటి కలధోరణి కొంతవరకైనా తెనుగువారికి పరిచయం కావచ్చు నని ఈ రచయిత భావన. ఈ భావన ఎంత నెరవేరినా ఈ పుస్తక ప్రచురణ సార్థకత చెందినట్లే.

—శ్రీ వాత్సవ

## ఈ సంపుటిలో నాటికలు:





# సౌందర్యమోహము

రచయిత:
పెరియస్వామితూరన్

తమిళభాషాసంఘంవారు ప్రచురించుచున్న విజ్ఞాన సర్వస్వమునకు ప్రధాన సంపాదకుడు, భాషకు అనేక పరిశోధనలుచేసి పుష్టి కూర్చిన పండితుడు. చిన్న కథలు, నాటకములు, కవిత, సంగీత కృతులు, గేయములు రచించి గ్రంథములుగా ప్రకటించి పేరు ప్రఖ్యాతులు పొందినవాడు. పూర్తి పేరు— మ. ప. పెరియస్వామితూరన్.

విజ : ఆమెనుగూర్చి ఆలోచిస్తూ అలాగ బెంగపెట్టుకొంటే ఏమిటి ప్రయోజనం ? ఆమె నిన్నెంతమాత్రము లక్ష్యపెట్టకుండా వెళ్ళిపోయిందే ?

మురు: (మెల్లగా) ఆమె వెళ్ళిపోయింది. నిజమే ... కాని ఆమెమీద ఉన్న ప్రేమమాత్రం పోలేదు.

విజ : కళాకారులకికూడ ఇటువంటి మాయని ప్రేమ ఉంటుందా ?

[కుర్చీలో కూర్చుంటాడు.]

మురు: ఏం ? ఉండకూడదా ? కళాకారులకే ప్రేమలోని పూర్తి శక్తి అర్థం అవుతుంది.

విజ : మరి నీకు కళే ప్రేమ దైవము అంటావు ?

మురు: అవును. కళయే నాకు ప్రేమ దైవము. ఆ దైవానికి ప్రాణము పోయనక్కరలేదా ? ఆ ప్రాణమే ఆమె. ఆమె లేని కళ ప్రాణములేని శరీరమువంటిదే !

[లేచి కిటికీవైపు వెళ్ళి చూస్తూ ఉంటాడు.]

విజ : మురుగా ! ఎందుకు నీవీ అనవసర భ్రమలో పడి ఉంటావు ? మరొక క్రొత్త సుందరిని పిలిచి ఆమెను ఎదురుగా పెట్టుకొని ఇంకొక క్రొత్తబొమ్మ వేయడం ప్రారంభించావంటే ఇది మరచిపోవచ్చు. అది సహజమేకదా !

మురు: ఎంతమందిని తెచ్చి వారి బొమ్మలు వేసినప్పటికీ, ఆమెనుమాత్రం ఎప్పటికీ మఱచిపోలేను.

విజ : (నవ్వుతూ) ఇలాగ ఎన్నిసార్లు అన్నావో; ఎన్నిసార్లు నేను విన్నానో ! దీనిలో క్రొత్త ఏముంది ?

మురు: నీవు ఏమనుకొన్నా సరే! నే నామెనుమాత్రం మఱచి పోను.

విజ : ఒకేచోట మనస్సు అర్పించినవాడు గొప్ప కళాకారుడు కాలేడు-అని నీవు చెప్పినదంతా పోయిందా?

మురు: నేను అలాగే అనుకొనేవాడిని... అయితే....

విజ : అయితే ఏమిటి? ఇచ్చేవారము తిరిగి యిదే సమాధానం చెప్పబోతున్నావు!

మురు: (వెనుకకుచూస్తూ) విజయా! నీకు నా తత్వం బాగా అర్థమయిందని ఇంతకాలం అనుకొంటూ ఉండేవాడిని. అయితే కొంచెముకూడ తెలియలేదన్నమాట.

విజ : పోనీ నాకు తెలియకపోతే ఫరవాలేదులే. నీకు తెలిస్తే చాలు.

మురు: నాకు ఇప్పుడు బాగా తెలుస్తున్నది.

విజ : మరి ఆమె వెళ్ళిపోయిందే; ఆమెనుగూర్చి తలపోసుకొంటూ ఏమిచేస్తావు?

మురు: ఆమెనుగూర్చి తలపోసుకోవడంలోనే ఒక ఆనందం ఉంది.

విజ : నిజానికి నీకింత బెంగ కలగడానికి కారణం ఆమె యెడల నీవు విజయం సాధించలేక పోవడమే అని నా భావన. అటువంటి విజయమే సాధించి వుంటే ఆమెను గురించి ఆలోచించనే ఆలోచించవు. ఆమె మీద ప్రేమ అంతా అప్పుడే మాయమైపోయి వుండును.

మురు: (ప్రక్కకు వచ్చి) అదేనా నన్ను గురించి నీవు అర్థం చేసుకొన్నది ?

విజ : నేను నిన్ను తక్కువ చేస్తున్నానని అనుకోకు. అనవసరంగా నీవు ఇలాగ బెంగ పెట్టుకొని కూర్చోవడం నేను ఎంతమాత్రం సహించలేకుండా ఉన్నాను. నీవు చిత్రించిన యీ అందమైన చిత్రం చూచి ఒక్క మాటయినా చెప్పకుండా ఆమె వెళ్ళిపోయింది. అటువంటి దానికోసం ఎందుకు పలవరిస్తూ కూర్చుంటావనే నే ననేది !

[లేచి ఆ బొమ్మవద్దకు పోయి నిలువబడతాడు.]

మురు: ఆమె ఏమీ మాటాడనక్కరలేదు. ఏమీ చెప్పక పోతే పోనీ; ఆమె సౌందర్యము నా చిత్రశాలలో తాండవ నృత్యము చేస్తూ ఉంటే-ఒక్క క్షణం ఆమె యిక్కడకు వస్తే చాలదా ? జీవితమంతా అదేరాక జ్ఞాపకం పెట్టుకొని ఆలోచిస్తూ ఉండవచ్చునే !

విజ : మురుగా !... నీతో దీనిని గురించి ప్రస్తావించి ప్రయోజనంలేదు... ఉ(మ్) ... అది అలాగ ఉంచు; నీతో ఒక విషయం చెప్పాలి-అని వచ్చాను. ఈవేళ చెన్నపట్టణంనుండి ఒక అమ్మాయి వచ్చింది. చాల అందమైనది. ఆమెను చూచి కొన్ని చిత్రాలు వేస్తే చాల అందంగా ఉంటుంది.

మురు: బొమ్మలు వెయ్యాలని నాకు మనస్సే పోవడంలేదు.

విజ : ఆమెకూడ కాలేజీలో చదువుకొంటూన్నదట. సెలవులు కని ఇక్కడికి వచ్చింది.

మురు: ఇదేమన్నా సెలవులకు రావడానికి ఉదకమండలమా? కొడైక్కెనాలా ?

విజ : ఇక్కడ ఆమె అక్కగారింట్లో కొన్నాళ్ళు ఉండి తరువాత ఉదకమండలం వెళ్తుందట. మంచి మాటకారి.

మురు: అందుచేతనే కాబోలు ఇన్ని సంగతులు తెలుసుకోగలిగావు!

విజ : ఈవేళ సాయంకాలం జరుగబోయే టీపార్టీకి ఆమె కూడ వస్తుందని తలుస్తాను.

మురు: ఓహో! ఈవేళ టీపార్టీయా ? నేను మఱచిపోయాను సుమా !

విజ : ఆమె వస్తే, ఆ టీ పార్టీలో నీ కామెను పరిచయం చేస్తాను.

మురు: శకుంతల చిత్రం వేయడానికి ఆమె సరిపోతుందా ?

విజ : చాల చక్కగా సరిపోతుంది. నీవు చూచిన వెంటనే ఆ సంగతి కనిపెట్టగలవనుకొంటాను.

మురు: సరి ! అలాగేచూద్దాం. నాకు పరిచయం చేస్తావుగా?

విజ : అలాగే! నీవు సరిగా అయిదుగంటలకు తప్పకుండా వచ్చేయ్.

మురు: (కొంచెం సంశయంతో) తప్పకుండా వస్తాను.

[విజయన్ బయటికి వెళ్ళిపోతాడు. మురుగన్ అతనిని చూస్తూ అలాగే నిలుచుండిపోతాడు]

# రెండవ దృశ్యము

ఆదే చిత్రశాల. ఈసారి బొమ్మలన్నీ చక్కగా అమర్చబడిఉన్నవి. ఒక సుందరమైన యువతి ఎదురుగా నిలువబడి ఉంటుంది. ఆమెనుచూచి మురుగన్ చిత్రం దిద్దితీర్చుతూ ఉంటాడు.

మురుగన్: (లిఖిస్తున్న చిత్రం నిలిపి) ఈ బొమ్మ వేయడం ఇంతటితో ఆపివేస్తాను. ఇంత ఎక్కువసేపు మిమ్మల్ని నిలిపి ఉంచివేశానే అని నాకు బాధగా ఉంది. కాలం గడిచినదే నాకు తెలియలేదు.

వసంత: మీరు చిత్రం చిత్రిస్తూఉంటే ఎంతసేపయినా విసువు అనేది లేకుండా నేను నిలిచి ఉండగలను.

మురు: చిత్రకారుడు కోరినట్టు, శరీర భంగిమలు చూపుతూ అదే భంగిమలో నిలిచి ఉండడం శ్రమకాదా? దానిలోనూ శకుంతల దుష్యంతుని వెనుక వియోగ దుఃఖంతో ముఖంవాడి నిలుచుండి ఉన్నట్టు నిలిచి ఉండటమంటే మాటలా?

వసం: నాకుమాత్రం అదేమిటో మీరు బొమ్మ వేస్తు న్నంతసేపు శ్రమగానే అనిపించడంలేదు. అది వేస్తూ ఉన్నపుడు మీ ముఖంలో కనిపించే కళవళికలు, అద్భుతమైన భావనలు - ఇవన్నీ చూస్తూ ఎంతో ఆనందంగా కాలక్షేపం చెయ్యాలనే కోరికే కలు గుతూ ఉంటుంది.

[మురుగన్ ప్రక్కకు వస్తాడు.]

మురు: వసంతా! రేపటికి చిత్రం పూర్తి అవుతుంది. ఉదయం పదిగంటలకే వస్తే, ఈ బొమ్మ వేయడం ముగించి వేస్తాను. ముగించి నిన్ను పంపించివేస్తాను.

వసం: అవశ్యం అలాగే పదిగంటలకే వచ్చివేస్తాను. ఈవేళ సినీమాకు పోదామా?

మురు: నేను సినిమాకు ఎప్పుడూ వెళ్ళను. నీవు పిలుస్తున్నావు కనక రమ్మంటే వస్తాను.

వసం: నాకోసం వస్తానని అంటున్నారే! దానికి నాకు చాల సంతోషంగాఉంది. మురుగా! నేను రాగానే మీ బొమ్మలన్నీ చూపిస్తాను అన్నారే-ఈవేళైనా చూపించకూడదా?

మురు: రేపు చూచుకోవచ్చులే.

వసం: ప్రతిరోజూ ఇలాగే అంటూ వచ్చారు. నేను చూస్తే దృష్టిదోషం తగులుతుందని భయమా?

[ప్రక్కనున్న పీటమీద కూర్చుంటుంది.]

మురు: నీ యందానికి ఆమె సరిపోతుందా యని?

వసం: అవునవును. నేనూ నా యందం! నా సౌందర్యం చూచి పొగడటానికి మీరొక్కరైనా ఉన్నందుకు ఆనందం పొంగి పొరలుతున్నది.

మురు: మిగిలినవాళ్ళ కెవరికీ కళ్ళు లేవా ఏమిటి?

వసం: వాళ్ళ కన్నులలో కళ అనే తెర లేదుకదా? ఆ తెర వేసి చూచినపుడే, ఏది చూచినప్పటికీ అందంగా కనిపిస్తుంది.

మురు: అబ్బో! ఈ కాలేజీచదువు చదువుకొన్న ఆడపిల్లలను మాటలలో జయించడం కష్టం.

వసం: అయితే, కేవలం మేమంతా వట్టి కబుర్ల పోగుల మంటారా?

మురు: (నవ్వుతూ) వసంతా, సినీమాకి సమయంకాలేదూ? మాటలాడుకొంటూ మెల్లగా నడచిపోవచ్చును!

[లేచి వెళ్ళడానికి ఆయత్తం చేస్తాడు.]

వసం : ఏమి సినీమాకు పోదాము?

మురు: దేనికి కావలిస్తే దానికి పోవచ్చును. నా కన్ని సినీమాలూ ఒకటే. నేను చూడవలసింది ఎక్కడికిపోయి చూడాలన్నా చూడవచ్చు.

వసం : అదేమిటి?

మురు: నీవు సినీమాచిత్రం చూస్తూ ఉండు. నేను నీ ఎడమ చేయి, ఎడమపార్శ్వము చూస్తూ ఉంటాను.

వసం : నన్నేదో మాటలమూట అంటూ వచ్చారే, ఇప్పుడు మీరు?

[నవ్వుతుంది.]

మురు: నీ అందమైనమాట ఒక్క మాట చాలదా?

వసం : ఈ పొగడ్తలన్నీ చాలులెండి! రండి పోదాం.

మురు: (పైకి-ఆమెవైపు దీక్షగా చూస్తూ) ఆ వేళ జరిగిన టీపార్టీ నేను ఎన్నటికీ మఱచిపోలేను.

వసం : ఏం? టీ అంత బాగా ఉన్నదా?

మురు: ఆ టీపార్టీలోనేకదా నిన్ను పరిచయం చేసుకొనే భాగ్యం కలిగింది? నిన్ను కలుసుకునే అవకాశం దొరికింది!

వసం : నన్ను కలుసుకోకపోతే ఏం, పుట్టి మునిగిపోయిందా?

మురు: ఇంత అందమైన సుందరిని నేను చూడలేక పోయే వాడినికదా !

వసం : మాటలలోనే మైకము క్రమ్మించి వేయడంలో మిమ్మల్ని మించినవాళ్ళు ఎవరూ లేరనుకొంటాను. త్వరగా బయలుదేరండి, టయిము అవుతున్నది.

[ఇద్దరూ బయటికి బయలుదేరుతారు.]

## మూడవ దృశ్యము

అదే చిత్రశాల. ఉదయం తొమ్మిదిగంట లవుతుంది. మురుగన్, విజయన్ కూర్చుని ఉంటారు. ఏదో చర్చిస్తున్న ట్లుంటారు. మురుగన్ చాల కలవరపడిపోయినట్టు ఆవేశంతో కనిపిస్తాడు. ఆతని కంఠంలో ఒక కలవరపాటు కనిపిస్తుంది.

మురు: ఒకరిపైన విరహంతో తపించిపోవడంలోకూడ ఒక ఆనందం ఉంటుంది. ఏమంటావు విజయా ?

విజ : నీకా విరహంతో తపన కలిగించిం దెవరు నాయనా ?

మురు: ఆమెయే ! వసంత.

విజ : వసంతా ?

మురు: అవును; నే నామెను ప్రేమిస్తున్నాను.

విజ : నీ కామెమీద ప్రేమ కలిగినట్లు నాకు తెలుసు. కాని ఆమె మనస్సులో అభిప్రాయం నీకు తెలుసా ?

మురు: ఓహో ! దాని గురించి సందేహం అక్కరలేదు.

విజ : నిన్ను ప్రేమిస్తున్నట్లు ఆమె చెప్పిందా ?

మురు: చెప్పనవసరంలేదు. ఆమె నడతనుబట్టి కనిపెట్టలే నంటావా ?

విజ : ఈ కాలపు ఆడపిల్లలు ఇలాగే చనువుగా ధారాళంగా మెసలుతూ ఉంటారు. అదిచూచి ... నీవు ఆమె సులభంగా దొరికిపోతుందని భావించకూడదు.

మురు: అదంతా నాకు తెలుసు. ఏమైనా నన్ను అంగీక రిస్తుంది–అనడానికి ఎంతమాత్రం సందేహమూలేదు.

విజ : పదిహేను రోజులక్రితం, మరొక కన్యను మనస్సులో తలపోసి తలపోసి బెంగపెట్టుకున్నావే; ఆ ప్రేయసి ఏమయిపోయింది ?

మురు: ఏ ప్రేయసి ? ఏ ప్రేమ ?

విజ : (లాగుతూ వున్నట్టు) ఏ ప్రేమా ? ఆమెనేకాదూ నీ కళాదేవతకు ప్రాణం పోసినదని అంటూ ఉండే వాడివి? ఆమెమీద నీవు చూపిన ప్రేమ –

మురు: విజయా ! నీవేదో యిష్టం వచ్చినట్టు మాటలాడి వేస్తావు. నాతో ఒక్క మాటకూడ బదులుచెప్ప కుండా మౌనం వహించిన ఆమెను తిరిగి జ్ఞాపకం తెచ్చుకోమని చెప్తున్నావు ?

విజ : నిన్ను జ్ఞాపకం తెచ్చుకోమని నేను చెప్పడంలేదు. నీవే ఆమెను ఎన్నటికీ మఱచిపోలేను అని చెప్తూ ఉండేవాడివి.

మురు: నాకు కళాహృదయం ఎటువంటిదో తెలియదు.

విజ : కళాహృదయం తెలియకపోవచ్చు కాని నీహృదయం నాకు తెలియదా ?

[లేచి తిరుగుతూ ఉంటాడు.]

మురు: వసంతకు తప్ప ఇంకెవరికీ నా హృదయంలో ఇంక స్థానంలేదు.

విజ : ఆమె రేపు ఊటీ వెళ్ళిపోతుంది. తర్వాత...

మురు: ఎవరు చెప్పారు ? అదేమీ లేదు, ఎక్కడికీ వెళ్ళదు. ఆమె నన్ను విడిచి ఎన్నటికీ వెళ్ళదు.

విజ : నీవు వేస్తున్న చిత్రం పూర్తి అయిందా ?

మురు: ఇంచుమించు పూర్తి అయినట్టే. ఇంక చివరి దిద్దుబాటులు చేసి ముగించివేస్తాను. ఆమె కొంచెం సేపటిలో ఇక్కడికి రావాలి.

విజ : అలాగయితే నీవది తయారుచేసి ఉంచు. నేను వెళ్ళి వస్తాను. రేపు సాయంకాలం కలుసుకుందాం.

[బయటికి వెళ్ళిపోతాడు. మురుగన్ త్వరత్వరగా ఏదో చేయబోయే ప్రయత్నంలో ఉంటాడు.]

# నాలుగవదృశ్యము

అదే చిత్రశాల. వసంత నిలువబడి ఉంటుంది. చిత్రం లిఖిస్తూవున్న మురుగన్ తూలిక గిన్నెలో ముంచి పైకి తీసి ఆమెను చూస్తూ మెల్లగా ముందుకి వస్తాడు.

మురు: వసంతా ! బొమ్మ పూర్తి అయింది. నాకింత ఓపికతో సహాయం చేసిన నీకు వందనము అర్పించవద్దా ?

వసం : అటువంటి ఉపచారములుకూడ ఆవశ్యకమైతే చేయండి.

మురు: ఉపచారము అనే మాట నీకు అక్కరలేదని నాకు బాగా తెలుసు. అయినప్పటికీ చిత్రకారుడి కర్తవ్యం నెరవేర్చడం అది విధికాదా మరి ?

వసం : (నవ్వుతూ) వట్టిమాటలు అప్పగించడంలో ఏమి నష్టం అని అనుకొంటున్నారా ? అయితే ఆ మాట లేవో అప్పగించండి!

మురు: నీ ముందు నేను అప్పగించే మాటలు వట్టి మాటలు కావు. అవి నా హృదయాంతరాల్లోంచి ఆవేశంతో చెప్పే మాటలు.

[దగ్గరికి రాబోతూ వుండగా వసంత
ఆ బొమ్మ దగ్గరికి చేరుకుంటుంది.]

వసం : మురుగా ! మీరు చాల చక్కగా యీ చిత్రం చిత్రించారు. మీ కళా ప్రావీణ్యమును పూర్తిగా యీ బొమ్మ వెలువరుస్తూ ఉంది.

మురు: నీవు రాకపోతే నే నింత అందంగా ఈ బొమ్మను వేయలేక పోయేవాడిని. ఈ చిత్రం ఇంత రమణీయంగా వచ్చేది కాదు.

వసం : నేను ఇలాగ బొమ్మ వేయండి-అని చెప్పి వేయించా నంటారా ?

మురు: నీవు చెప్పి వేయించలేదనుకో. నీ అందం చెప్పి వేయించింది.

వసం : సౌందర్యానికి అటువంటి సామర్థ్యం ఉంటుందని ఇప్పుడు మీరు చెప్తే తెలిసింది.

మురు: అన్ని అందాలకూ అటువంటి సామర్థ్యం ఉండదు. నీ యందచందాలకూ నీ సౌందర్యానికీ అదొక ప్రత్యేక ప్రావీణ్యం.

వసం : వచ్చినవాళ్ళ నందరినీ ఆకాశంయెత్తు పొగడివేయు డమే మీ పని అనుకొంటాను ?

మురు: నేను యథార్థం చెప్తున్నాను వసంతా ! నీ యంత సౌందర్యవతిని ఇంతవరకు చూడలేదు. ఇకముందు చూస్తాననికూడ అనుకోను.

వసం: (నవ్వుతూ) బ్రహ్మదేవుని సృష్టిప్రావీణ్యము నాతో పూర్తయిపోయిందంటారు. అంతేనా !

మురు: నేను నీతో ఇలాగ మాటలాడటం వేళాకోళం ఏమీ కాదు. నిజం చెప్తున్నాను. నా మనస్సులోని భావాలన్నీ వివరించి చెప్పాలని కుతూహల పడు తున్నాను.

వసం : ఇంకా ఏమిటి చెప్పబోయేది ? నన్ను అందాలరాణి అని చెప్పి నిశ్చయం చేసివేశారు !

మురు: దానితోపాటు మరొక విషయం చెప్పవలసి యుంది. నీవు కేవలం అందాలరాణివే కాదు; నా హృదయ రాణివి!

వసంత: (నిదానంగా) హృదయరాణినా ? మీరు చెప్పేది కొత్తగా ఉందే !

మురు: నిన్ను చూచినప్పటినుండి నా మనస్సులో తపన పడుతూనే ఉన్నాను.

వసం : (నవ్వుతూ) కళాకారుల తత్వమే అదేమో— అలాగ కనిపిస్తుంది.

మురు: వసంతా! నిన్ను నేను మనఃపూర్వకంగా ప్రేమిస్తున్నాను. నిన్ను నా ప్రేమ దేవతగా నా హృదయ మందిరంలో నిలిపి ఆరాధించుతూ ఉంటాను.

వసం : చిత్రం వేసినప్పుడల్లా మీకు సహాయం చెయ్యాలనీ ఎదుట నిలుచున్న ప్రతి స్త్రీగురించి ఇలాంటి మాటలతోనే తపనపడుతున్నానని చెప్పడం మీకు సముచితంగా ఉందా?

మురు: నేను ఇంతవరకు ఎవరినీ ప్రేమించలేదు. నీవే నా మొట్టమొదటి ప్రేమదేవతవు. నీవే నా...

వసం : ప్రేమ అనేది ఇద్దరి హృదయాలలోనూ ఉదయించాలి కదా? ఆవుకున్న రెండుకొమ్ములలాగ, ఒకే సమయంలో ఉభయుల హృదయాలలోనూ ఉద్భవించే ప్రేమయే నిజమైన ప్రేమ అనవచ్చు.

మురు: నీకు నామీద ఎంతో అనురాగం ఉందని నాకు నిశ్చయంగా తెలుసు.

వసం : ఏమిటి? నేను మీతో ధారాళంగానూ, చనువుగానూ మాటలాడుతూ తిరుగుతూ ఉన్నాననా?

మురు: వసంతా! చాలు. ఇంకా నన్ను హెచ్చు పరిశోధన చేయ నక్కరలేదు. నేను నీవు ఎలాగ చెప్తే అలాగ వినడానికి సిద్ధం. నేను నీకు బద్ధుడను.

వసం : మురుగా! నేను నీ కళాప్రావీణ్యం మెచ్చుకొంటాను. ఆ కారణంగా నీవంటే నాకు ప్రత్యేక గౌరవముంది. అంతవరకు నిజమే.

మురు: ఇప్పుడు నీ హృదయంలోని నిజమైన అనురాగంలో కొంత వెలువరచడానికి ప్రారంభిస్తున్నావు. సంతోషం—ప్రేమే నీవూ నేనుగా...

[దగ్గరగా రావడానికి ముందుకు వస్తాడు]

వసం : (దూరంగా పోతూ) మీరు అక్కడే నిలుచుండి మాటలాడండి. మీ కళాప్రావీణ్యం నేను మెచ్చుకొన్నంతమాత్రంచేత మీ హృదయంలో ఉండే భావాలను, ఆశలను గౌరవించినట్లుకాదు.

మురు: ప్రేమతో తపించిపోతూ వసివాడిపోయిన యీ హృదయంమీద నీకు అనుతాపం లేదా?

వసం: మీరు ప్రేమ ప్రేమ అని చెప్తూన్నదంతా ఏమిటో నాకు తెలుసు. ఎక్కడ సౌందర్యం కనిపించినా దాని మీద మీకు వ్యామోహం కలుగుతూ వుంటుంది; కాని అది ప్రేమమాత్రం కాదు.

మురు: వసంతా! నేను చెప్తున్నది సత్యం. నామీద నీకు...

వసం : నా స్నేహితురాలు కమలతోకూడ ఇలాంటి మాటలే చెప్పారట. ఆమె యిక్కడినుంచి వెడలిపోయి మూడు వారాలుకూడ ఇంకా కాలేదు... కాని—

మురు : (ఆశ్చర్యంతో) కమలా? నీకు స్నేహితురాలా!

వసం : అవును. ఆమె మిమ్మల్ని గురించి నాతో అంతా చెప్పింది.

మురు: కమలను ప్రేమించినట్టు నేను చెప్పింది వాస్తవమే. కాని అది సత్యమైన ప్రేమ కాదని నీవు వచ్చిన తర్వాతనే నాకు బాగా అవగాహన మయింది.

[అతని కంఠంలో ఒక జాలి గోచరిస్తూఉంది.]

వసం: ఇదికూడ సత్యము కాదని మరికొన్నినాళ్ళు పోయిన తర్వాత అవగాహనలోకి వస్తుంది.

మురు: నేను ప్రేమించడమే సాధ్యం కాదంటున్నావా ?

వసం: సౌందర్య వ్యామోహంవేరు– సహజానురాగం వేరు అని మాత్రం నేను చెపుతున్నాను. సౌందర్యమోహం అనేది మఱచిపోవచ్చును. కాని సహజప్రేమ మరవ రాని నిరంతరానుబంధం. అది కేవలం సౌందర్య ముతో పుట్టుకొని వచ్చినది కాదు.

మురు: (యోజించి కొంచెం నిదానంగా) విజయుడుకూడ అలాగే చెప్తూ ఉంటాడు.

వసం: ఆయనకు మీ మనస్తత్వం బాగా తెలుసు. మిమ్మల్ని బాగా అర్థంచేసుకొన్నాడు. ఆయనేకాదు, కమలకూడ కొన్నిరోజుల తర్వాత అర్థంచేసుకొన్నది.

మురు: నిజంగానా ? ఇప్పుడు నీవు...

వసం: కమల మీతో చనువుగాఉండి మిమ్మల్ని తెలుసు కొని రమ్మని నాతో చెప్పి పంపించింది.

మురు: అందుకోసమేనా నాతో ఇంత చనువుగానూ ఇంత ధారాళంగానూ తిరుగుతూ వచ్చావు ?

వసం : సౌందర్యాన్ని కళ వశపరచుకోవచ్చు; కాని కాముమ్ము మాత్రము వశపరచుకోకూడదు; ఇవి కమల చెప్పిన మాటలు.

మురు: ఇప్పుడు నీవుకూడ ఆమాటలే చెప్పి నన్ను పైకెత్తి చూపి హేళన చేస్తున్నావన్నమాట.

వసం : మురుగా! నన్ను మీరు క్షమించాలి. మీ కళా ప్రావీణ్యమంటే నాకూ కమలకూకూడ అమిత గౌరవము; మర్యాద.

మురు: ఉ(మ్)...(చేతిలోని తూలిక పారవేస్తాడు.)

వసం : నేను వెళ్ళివస్తాను. రేపు ఉదయం నేను ఉదక మండలం వెళ్ళాలని బయలుదేరుతున్నాను. ఈసారి వచ్చినపుడు మేము ఇద్దరమూ కలిసి వస్తాము. అప్పుడు మీరు వేసిన క్రొత్త బొమ్మలు చూచే అవకాశం కలుగుతుందని ఆశిస్తున్నాను. మరి వస్తాను!

[వసంత బయటికి వెళ్ళిపోతుంది. మురుగన్ మనస్సు కరగిపోయినట్టు ఆమె పోయిన దిశవైపే చూస్తూ నిలవబడతాడు. మెల్లగా తల పట్టుకొంటాడు.]

— తెర —

— ... —

# కడసారి పిల్లవాడు

రచయిత:

"సోము"

మద్రాసు రేడియోకేంద్రములో ప్రసంగశాఖ నిర్వాహకులు. రేడియోలో 1940నుండి పనిచేస్తున్నవాడు. నాటకములు, చిన్నకథలు, కవిత, నవలలు, వ్యాసములు- అనేకము రచించి, అనేక సాహిత్య బహుమతులు పొంది, తమిళ పాఠకులకు బాగా తెలిసినవాడు. ఈ గ్రంథము సంకలనం చేసినవాడు. పూర్తి పేరు మీ. పా. సోముసుందరమ్.

## పాత్రలు

| | |
|---|---|
| జ్యోతిష మొదలియారు | ముత్తు |
| తండ్రి | అమ్మా |
| చెట్టియారు | భార్య |



# కడసారి పిల్లవాడు

జ్యోతిష మొదలియారు: మీరు ఎన్ని చెప్పండి; ఈ మొదలియారు నోటితో జ్యోతిషం చెప్పడం, అది తప్పు అవ్వడంఅనేమాట అన్నవారు ఎవ్వరూ లేరనుకోండి!

అమ్మ: అందుకేగదా! ఇప్పుడు మిమ్మల్ని పిలిపించింది!

జ్యోతి, అమ్మా! సరిగా వినండి; పిళ్ళేగారూ! మీకే యీ జ్యోశ్యం చెప్తున్నాను: ఏది యేమైనప్పటికీ పిల్లవాడీరాత్రి పన్నెండు గంటలలోపున ఇంటికివచ్చి చేరుకొంటాడు. చేతిలో ఇంకా ఒక అణా డబ్బులు మిగిలి ఉంటాయి. అవి తీసుకొని, బీచీలో ఏ తాళింపు సెనగలో కొనడానికి సరిపోతాయి, దాని తర్వాత తనంత తానే ఇంటికి వచ్చివేస్తాడు. మీ రేమీ కంగారు పడకండి:

తండ్రి: మొదలియారుగారూ? రిజల్టులు వచ్చిన రోజు నేను ఊరిలోనే లేను. పిల్లవాడు ఇంట్లోనే ఉన్నాడు. మరునాడూ, ఆ మరునాడూ ఇంట్లోనే ఉన్నాడు. ఈవేళ ఉదయం నేను వచ్చానో లేదో, నా కంట పడకుండా ఎక్కడికో వెళ్ళిపోయాడు. ఏమిటి- ఏమయ్యాడా,అంటే పిల్లవాడు ఎక్కడికివెళ్ళాడో ఏమో-అంటూ పిచ్చెత్తినట్టుగా ఉంది...

జ్యోతి: ఏది యేమైనప్పటికీ కని పెంచిన మనస్సు-చూడండి-తండ్రి హృదయం అనేది తల్లడిల్లిపోతుంది. అయితే తండ్రి అంటే పిల్లవాడికి ఆమాత్రం భయం ఉంటేనే పని జరుగుతుంది.

తండ్రి: ఏమి భయమో... పాడుభయం. కాని మొదలియారు గారూ— ఈ భయమంతా చదువులో చూపించాలి.

జ్యోతి: పిల్లవాడి లోపం ఏమీ లేదండి ...... అదంతా గ్రహాధిపతి చేస్తున్న నడత.

తండ్రి: ఏమి గ్రహాధిపతో ఏమిటో! మొదలియారుగారూ! మూడు సంవత్సరాలనుండీ యస్. యస్. యల్. సి. పరీక్షకు వెళ్ళి వ్రాస్తూ ఉన్నాడు. మూడు సంవత్స రాలూ ఈ గ్రహాధిపతి ఇలాగే నడిపిస్తూ, ఇటువంటి కార్యాలు చేస్తున్నాడు అంటారా?

జ్యోతి: అయ్యో! కోపపడకండి; ఇప్పుడు మీ కడసారి పిల్ల వాడికి నడుస్తున్నది ఏడున్నర సంవత్సరాల శని దశ.

తండ్రి: సరిగా చూడవయ్యా! ఈ మూడు సంవత్సరాలూ జరిగింది కాకుండా ఇంకా నాలుగు సంవత్సరాలు ఈ క్లాసులోనే కాలక్షేపం చెయ్యవలసిన బాకీపడి ఉన్నా డంటారా?

జ్యోతి: ఏడున్నరయేళ్ళ శని దశ అంటే ఏలిననాటి శని ఏడు న్నర సంవత్సరాలని కాదు. ఆ దశలో ఇప్పుడు కొంచెం మరీ కఠినంగానూ అస్తవ్యస్తంగానూ ఉన్న దన్న మాట. వచ్చే సంవత్సరానికి దశ మారు తుంది. అప్పటినుండి మంచి యిదిగా ఉంటుంది. మంచి యిదిగా ఉంటుంది లెండి!

తండ్రి: ఏమి యిదో పోండి—అదంతా కట్టిపెట్టి, వాడి జాతకం తీసి అలాగు అట్టేపెట్టి, నా జాతకం తీసి కొంచెం

చూడండి. సన్యాసియోగం నాకు ఎప్పుడు పట్టుందో ఆ జాతకంలో కొంచెం పరికించి చూడండి.

జ్యోతి: బాగానేఉంది. మీ రీ ప్రపంచంలో ఇంకా యెన్నెన్నో అనుభవాలు అనుభవించవలసియుంది. అవన్నీ కాకుండా ఇంతలోనే...

తండ్రి: చాలు చాలు! ఇంతవరకు అనుభవించింది చాలు లెండి. ఏమి ప్రపంచమో ఏమి అనుభవమో ఇంత వరకు చాలులెండి.

అమ్మా: ఇప్పు డేమి లోటు వచ్చిందో అడగండి, జ్యోతిష మొదలియారుగారూ! పిల్ల లందరూ బాగానే ఉన్నారుకదా?

తండ్రి: మిగిలిన పిల్లవాళ్ళను గురించి నేనే మనడానికి నాకేం వెఱ్ఱా? పిచ్చా? పెద్దవాడున్నాడే వాడందరిలోకీ రాజా! ఆ రోజులలో ఒక్కో సంవత్సరానికి రెండేసి క్లాసులు ప్యాసయి వచ్చేవాడు. ఎప్పుడూ డబుల్ ప్రమోషన్.

జ్యోతి: ఔను మరి, అతగాడి వాక్కులో గురువు ఉచ్చ!

తండ్రి: రెండవ వాడు మాత్రం అల్లరి పిల్లవాడా? హూఁమ్! జీతం కట్టనక్కరలేకుండా వాడి తెలివితేటలవల్ల ఇంజనీరింగు వరకు చదువుకొన్నాడు వాడు.

జ్యోతి: అవును, అతనికి శనీ శుక్రుడూ ఒక రాశిలో చేరి యున్నారు. అది చాల గొప్పగా చెప్పదగిన జాతకం.

తండ్రి: మూడవపిల్లవాడు సైన్సులో ప్రెసిడెన్సీ ఫస్టు. ఇప్పుడు మన చేతిది ఒక దమ్మిడీకూడ ఖర్చు లేకుండా అమెరికాకు ప్రయాణమై వెళ్ళబోతున్నాడు.

జ్యోతి: ఆ యబ్బాయి జాతకం ఎప్పటికైనా రాబడి కల్గిన జాతకం. సప్తమాధిపతి ఉచ్ఛమ్!

తండ్రి: హుఁమ్! ఈ కట్టకడపటి పిల్లవాడే నా ప్రాణాలు తీస్తున్నాడులెండి.

జ్యోతి: బాగానే ఉందండోయ్! అదంతా ఆ మహానుభావుడి మహిమ. ఇదంతా ఆ శనిగ్రహం చేయిస్తున్న పని. ఈ ఏలిననాటి శనిలో పిల్లవాడు-పాపం ఏమి చేయగలడు ?

తండ్రి: సరేకాని ఈ ఏడున్నర సంవత్సరాల ఏలిననాటి శని దశలో ఇంకా నాలుగు సంవత్సరాలు నడవాలి కదా ! ఈ నాలుగేండ్లూ నా ప్రాణాలు ఈ శరీరంలో ఉంటాయో లేదో-అది చూడండి!

జ్యోతి: పిళ్ళెగారూ! మీరేమీ కలవరపడకండి. మీ కడసారి పిల్లవాడి లక్షణంలో లోపం లేదు. మంచివాడు. కర్మస్థానంలో కుజుడు. ఒకటి రెండు, మూడు నాల్గు అయిదు. రెండు మూడు అయిదు. ఒకటి నాలుగు అయిదు. నాలుగూ ఒకటీ అయిదు.

తండ్రి: మొదలియారుగారూ ! మీ జ్యోతిషగణితం అంతా అలాగ ఉంచండి. ఇవన్నీ కట్టిపెట్టి ఒక్క సంగతి చెప్పండి. నా వయస్సు తప్పిపోయేటప్పటికి పెద్దతనంలో ఎవరు ఇంత అన్నం పెట్తారో అది చూచి చెప్పండి. చిట్టచివరి కుఱ్ఱవాడిని నమ్ముకుంటే పని జరుగుతుందా ? లేక పై ముగ్గురు వాళ్ళల్లో ఎవరి వెనుకనో ఒకడి వెనుక పోవలసి యుంటుందా ?

జ్యోతి: పిళ్ళేగారూ! ఏమీ కంగారుపడకండి; చెట్టు వేసిన వాడు నీళ్ళు పోయకుండా పోడు. దానిని గురించి మీరు బెంగపెట్టుకోకండి.

తండ్రి: హుప్ఁ... పిల్లవాడిక ముందుకి వస్తాడో లేదో చూడండి; అదీ ముఖ్యం! ఊరిలో జరిగే గొడవలూ కొట్లాటలూఅన్నీ వాడే గుత్తకు తీసుకొన్నట్లు అన్నీ వాడికే కావాలి. బడికి వెళ్ళిరమ్మంటే బయలుదేరి మామిడితోటలో కూర్చుండి వస్తాడు. ఇప్పుడు పరీక్షకు వెళ్ళి వ్రాస్తున్నాడో లేక పేపరివ్వగానే మడచి యిచ్చేవేస్తున్నాడో తెలియకుండా ఉంది.

జ్యోతి: ఈ విషయంలో శాస్త్రకారు డేమంటున్నాడో తెలుసా?

వీడయ్యా గుణములుకల
వాడయ్యా లక్షణముల వాడెవ డిలలో
రాడయ్యా వీనికి మొన
గాడయ్యా పనుల నేర్పు గలవాడయ్యా!

అన్నట్టు—మీ కడగొట్టువా డున్నాడే— మంచి పనివాడు; ఎప్పుడూ అన్నానికి లోటుండదు. ఎవరైనా అడిగితే ధారాళంగా అన్నదానం చేస్తాడు. భోజనయోగం అంటే అతనికే పట్టింది. భోజనయోగం అంటే గమనించవలసిందేకదా...

తండ్రి: బాగానే ఉంది. ఇంతవరకు వాడికి భోజనయోగం లాగే నడుస్తూ వచ్చిందిలెండి. సాపాటురాముడయ్యాడు.

జ్యోతి: అలాగనకండి. విషయం ఇంకా వివరంగా చెప్పాలీ అంటే—ఈజాతకుడు ఎంతోమందికి భోజనం తయారు చేసి పెట్టవలసిన యోగం ఉన్నది.

అమ్మా: ఎవరికి? మన కడసారివాడు ముత్తుకా?

తండ్రి: వాడే. ఎంతోమందికి అన్నదానం చేస్తాడట.

జ్యోతి: మీరు ఏమిటో మావాడేకదాయని అలక్ష్యంగా చూస్తున్నట్టు ఉన్నది. హుం - అతని చేతులతో ఊరు ఊరందరికీ భోజనంపెట్టి తినిపించే రోజు వస్తుంది.

తండ్రి: ఏమిటో! జాతకము మొత్తంమీద...

జ్యోతి: చాల లక్షణంగా ఉందండి. కడపటివాడుకదా అని కనీసంగా త్రోసి పారవెయ్యకండి. ఇక్కడే ఎక్కడో తిరుగుతూ ఉంటాడు. ఎక్కడికీ వెళ్ళడు చూడండి. వాడే వస్తాడు. ఏమమ్మా? అంతేనా?

అమ్మా: ఏమిటో! మొదలియారు గారూ? వాడి తలలో జేజెమ్మ లేకుంటే చాలు.

జ్యోతి: అంటే? తండ్రిగారు వాడిని కొట్టకుండాఉంటే చాలు నంటారా? అదేమీ ఉండదులెండి ఇంకమీదనుంచి.

చెట్టియారు: (ప్రవేశిస్తూ) ఏమండోయ్ పిళ్లేగారూ? మీరేనా ఈ ముత్తూ అనే పిల్లవాడి తండ్రి? ఏమయ్యా! నోటిలో ఉప్పూ మన్నూ వేసినట్టు మన్నుతిన్న పాములాగ మాటలాడవేం ?

తండ్రి: ఏం? నేనే... నేనే!

చెట్టి: ఏమయ్యా? నీకేమన్నా తెలుస్తుందా? నీకేమన్నా బుద్ధి ఉన్నదా! ఏమయ్యా మాటలాడవు ?

జ్యోతి: లేనిదానిని గురించి మాటలాడటం ఎందుకుగానీ, జరిగింది ఏమిటో చెప్పండి చెట్టియారుగారూ !

చెట్టి : నీవెవరవయ్యా ఏది చెప్పాలో నన్ను చెప్పమన డానికి, సిఫారసు చెయ్యడానికి? ఓ ! జ్యోతిష్కుల వారా ? అలాగ చెప్పండి ! లేనివాటిని చెప్పడం మీకు రివాజే! అయితే జ్యోశ్యులుగారూ ! ఇత గాడికి మీరుచెప్పి పంపించిందే అయివుంటుంది ఇది!

తండ్రి: చెట్టియారుగారూ! పాపం! జోశ్యుల వారిమీద కోప గించుకొంటూ రెందుకుగాని జరిగిందేమిటో కొంచెం చెప్పండి.

చెట్టి : జరిగినదా ?... జరిగింది ఏమని చెప్పను ? ఏమయ్యా- నీవద్ద ఏమనిచెప్పను? కాదు-నీవద్ద ఏమనీ చెప్పుకోనా యని! 'ఒరేయి అబ్బాయి ఇలారా' అని లోపలికి రమ్మని పిలుస్తే ఆ పిల్లవాడు భయపడి బయటనే నిలుచుండిపోయాడు. వాడిని అలాగ కొట్టి చంపి భయ పెట్టి ఉంచారు. అందుకే తండ్రి అంటే కట్ట కడపటి పిల్లవాడికి అంత భయం. ఏమయ్యా! తండ్రివి ? నీకు కళ్ళుంటే చూచుకో ? అసలు కళ్ళున్నాయా యని ?

తండ్రి: చెట్టియారుగారూ ? మీరు ఏం జరిగిందో చెప్పండి. నేను పిల్లవాడిని పిలిచి కనుక్కొంటాను.

చెట్టి : కనుక్కొంటాడట ! ఏమిటయ్యా కనుక్కొనేది ? ఇటు వంటి పిల్లవాడు నా కున్నాడని చెప్పుకోనేకంటే ఒక హైడ్రోజన్ బాంబువేసి వాడిని కొట్టివేస్తే నే

నయం! పెళ్ళివారింటికి భోజనానికి అని వెళ్ళేటప్పటికి ఇడ్లీ పెడతానని లోపలికి పిలిచి, ఇదిగో చూడండి— ఈ తలమీద— ఈ పిల్లవాడి తలమీద, ఇడ్లీ సాంబారు పాత్ర బోర్లా బోస్తాడా? తలమీదనే ఇడ్లీ మాదిరి బొప్పికట్టింది. చూడండి!

జోశ్యతి: సరి. అదా సంగతి! సాంబారు పాత్రతో కొట్టాడన్న మాట. విషయం కొంచెం రసవంతంగానే ఉంది. భోజన...

చెట్టి : ఏమీ మాటలాడరేమిటయ్యా? ఆ దెబ్బ కొంచెం మాసిపోయి, అది కనిపించక పోయినప్పటికీ, గమనించ వలసిందే— మర్యాద మట్టమయిందికదా! పోయిన ప్రాణాలు, మాన మర్యాదలూ మీరు తెచ్చి యిస్తారా? ఏమిటయ్యా జోశ్యులవారూ మాట లాడవు? పోయిన మర్యాద నీ జోశ్యం తెచ్చి యిస్తుందా? నీ జోశ్యం తెచ్చి యిస్తుందా అంట?

జోశ్యతి: బాగానేవుంది. ఇప్పుడన్నీ వదలిపెట్టి నా జోశ్యం మీద విరుచుకొని పడుతున్నట్టుగా ఉందే...

తండ్రి: సార్! మీరు దయచేసి ఇంటికి వెళ్ళండి, నే నిదంతా విచారించి తెలుసుకుంటాను.

చెట్టి : సారూ లేదు గారూ లేదు. అంతా విచారిస్తాడట, విచారణ! మీరంతా విచారించి జడ్జిమెంటు చెప్పే లోపున ఆ కడపటివాడు వచ్చి మీ తలకి మరా మ్మతు చెయ్యకుండా మీ బుద్ధి భద్రంగా వుండ నియ్యాలికదా! అది చూచుకోండి ముందు.

తండ్రి: నా తలమాటకేంలెండి ఎక్కడికీ పోదుగానీ- చెట్టియారుగారూ! మీరు కోపపడకండి; దయచేసి ఇంటికి వెళ్ళిరండి. నే నంతా గమనించుకొంటాను. చూడండి జోశ్యులుగారూ - నా తలవ్రాత! ఎవరిని చూచి ఏమంటే ఏమి ప్రయోజనం?

జ్యోతి: ఇదంతా! భోజనయోగం చేస్తున్న వక్రం కలవరపడకండి. పిల్లవాడు పొయ్యిమీద పెనం ఆయుధంగా స్వీకరించినప్పటికీ దానిలో అద్భుతమైన నేర్పు చూపించాడు. చెట్టిగారు మన వద్దకు వచ్చి మనమీద ఇంత హడావిడి చేశాడుకాని మన కడ సారి వాడిని చూస్తే అక్కడ గడగడ లాడక తప్పదు సుమండీ.

తండ్రి: ఏమిటోనండి- మొదలియారుగారూ! వాడికి మంచి కాలం ఎప్పుడు వస్తుందో ఏమిటోగాని అంతవరకు వాడి కాళ్ళు కట్టివేసి ఉంచి తే—

జ్యోతి: పొయ్యి మీద పెనం చేతిలో ఆయుధం లాగ కనిపించకూడదంటారు. వాస్తవమే! మరి ఇవన్నీ వాటంతట అవి జరిగిపోతాయండీ పిళ్ళేగారూ? ఆ దశ మార్పు రానీయండి, వాటంతట అవే అన్నీ మారిపోతాయి. నేను వెళ్ళొస్తాను-

[ తెర ]

# రెండవ దృశ్యము

ముత్తు: ఆ కాలంలో– నా చిన్నతనంలో నన్ను గురించి నాన్నగారితో చెప్పేటప్పుడు భోజనయోగం ఉన్న దని జ్యోతిష్యుడు చెప్పేవాడు. ఎన్నో సంవత్సరాలు గడచిపోయాయి. ఆ మాట యీవేళ విన్నట్టుగా ఉంది.

భార్య: అది యిప్పుడెందుకు జ్ఞాపకం వచ్చింది?

ముత్తు: అదికాదు; నీ చేతి పుణ్యమంటూ నాకా యోగం అనుభవించే భాగ్యం కలిగిందని అనుకొంటున్నాను. ఆమాటే చెప్తున్నాను.

భార్య: అంటే మీ అభిప్రాయం?

ముత్తు: అంటే–ఆ యోగం నాకు లేదా యని అంటున్నాను. నేను గుమాస్తాగా జమాఖర్చులు చూస్తున్నానే– ఆ సత్రములో భోజనం చేసేవాళ్ళకి ఆ యోగం కలిగిందీ అంటున్నాను.

భార్య: ఏం? ఇక్కడ మీ భోజనయోగానికి ఏం లోపం అని నే నడుగుతున్నాను.

ముత్తు: అదికాదులేవే! ఊరంతా 'సత్రానికి గుమాస్తాగార'ని మనకి పేరు. నేను చీటీ యిచ్చి పంపించినవాడికి భోజనం పెడతారు, అది లేనివానికి భోజనం పెట్టరు. సరేకాని, ఈవేళ మనకి ఏమిటి వంట చేశావు?

భార్య: అరటి దూట వేపుడు; ఒడియాల పులుసు; అప్పళమ్;

ముత్తు: అప్పళమ్‌కూడ వంటకంలో చేర్చుతావా? బాగుంది! ఇంకా చెప్పు– అప్పళమ్, అన్నం, మజ్జిగ, ఉప్పు, విస్తరి, గ్లాసు, నీరు, పీట ...

భార్య: చాలు చాలు. మీ సత్రం లెక్కలలో, ఒకటిన్నర తావులలో లీస్టుగా వేసినట్టు ఇక్కడ ఏడు సారకాయలూ అవీ లేవు. తెలిసిందా? అంత రుచిగా ఉంటే ఆ సత్రములోనే భోజనం చేయవచ్చు. ఇక్కడకు వచ్చి పెద్ద హడావిడి చేయనక్కరలే.

ముత్తు: నీ వెన్ని అయినా చెప్పు; అక్కడ వంటచేసేవాళ్ళందరూ మగవాళ్ళేకదా! వాళ్లెంత చేసినా ఏమి బాగా ఉంటుంది- మగ మహారాజు చేతి వంటే నంటారు.

భార్య: చాలు చాలు. ఒకసారి అలాగని మగవాడి వంటలో ఏముంది అంటారు. మరొకసారి వంటచేస్తే మగవాడే వంటచెయ్యాలి నలభీమపాకం-అంటారు. నలపాకం అంటారు తప్ప దమయంతి పాకం లేదే అంటారు. ఈ నాలుకకు ఏమున్నది ఇలాగా పలుకుతుంది; అలాగా పలుకుతుంది.

ముత్తు: ఇది ప్రతిరోజూ అరటిదూటకూర తింటున్న నాలుక మరి. ఏదీకూడ దీనికి స్థిరము అనేది ఉండదు.

భార్య: సరేలెండికాని - విస్తరివేస్తాను కూర్చోండి.

ముత్తు: ఇది పొడిచేసిపెట్టావా? ఇదేమి వేపుడు ఇదంతా ఉప్పుకశం చేసిపెట్టావేమిటి? వీధిలో తీసుకెళ్ళి పారవెయ్యాలేమో! సరిగాని, ఇదేమి అప్పళమ్? అబ్బబ్బా దీనినిండా రాళ్ళే. ఈరాళ్ళు తీసికొనిపోయి సత్రంలో దిమ్మెసావేయవచ్చు. అన్నం ఇంత పదును పదునుగా ఉందే? ఇంతకంటే ఇనుపగుగ్గిళ్ళు నయమేమో!

హుమ్. అక్కడ సత్రంలో ఎంతోమందికి నా చేతు
లారా భోజనయోగం. ఇక్కడ అంతా అకాలంలో
జ్యోతిష్యుడు చెప్పినట్లు, ఆ గ్రహాధిపతి నడతలాగుంది.
అదేలే గృహలక్ష్మి కటాక్షం! హూఁ ... పులుసు
తీసుకురా! ఇంతకీ నా కర్మ-జాతకఫలం అలాగుంది!

[భార్య సణుగుకొంటుంది.]

ముత్తు: ఏమిటి సణుగుకొంటున్నావు? హూఁ! దీనికి సణు
క్కోవటం ఎందుకు? ఇటువంటి భోజనం పెట్టినందుకు
నీవు సిగ్గుపడటంలేదా?

భార్య: చాలు చాలులెండి. ఇలాగ ఏది వచ్చినాకాని నన్ను
పట్టుకొని ఏదో ఒకదానికి తిట్టుతూ ఉండాలి. నేనే
మన్నా మా ఊరిలో మా యింట్లో వంటచేసి
పెట్టున్నానా? మీ యింట్లో వంట. మీ యింటి
సంసారం. ఒకొక్కరోజు పాతిక ముప్ఫైమందికి
పెట్టాలి అంటారు. నేనేకదా వంట చేయవలసింది?
ఒక్కత్తె అన్నతర్వాత – ఇంక ఏ ముక్కో ఏదో
కోసి వండి పెట్టాలికదా?

ముత్తు: ముక్కకోసి పెట్టున్నావో? నీ ముక్క కోసి పెట్టు
న్నావో నీ పులుసు అదీ, ముక్కు కోసి పెట్టేలోపున
యిలాగ తయారవుతున్నది!

భార్య: హూఁ. మీకేమి తెలుస్తుంది? మా నాన్న బ్రతికి
ఉన్నపుడు చెప్పేవాడు. వంట చేస్తే అమ్మాయే
చెయ్యాలీ-అంటూ ఉండేవారు.

ముత్తు: బలే బలే. ఇందులోకి మీ నాన్ననుకూడ తెచ్చావు. బాగానేఉంది - కొంచెం అన్నంపెట్టు (నవ్వు)

భార్య: ఈ దొంగనవ్వులెందుకు? తినేదీ తింటూనే ఉంటారు. ఇలాంటి తిట్లు తిట్టూ ఉంటే ప్రాణం చాలా క్షోభిస్తుంది.

ముత్తు: పెట్టిదానా? పెట్టినదంతా తిని తరవాత యిటువంటి వస్నె విమర్శ చేసిన కథ నీకు తెలియదా? అసలు లోకం పోకడే అలాగ!

భార్య: కథలు గిథలు చదివి కళ్లు నెత్తిమీదికి వచ్చాయన్న మాట. (నవ్వు)

ముత్తు: అబ్బా! నవ్వొ వచ్చిందికదా! ఏదీ నవ్వు. ఇంకొంచెం నవ్వు. ఆ పప్పు ఇలాగవేసి వెళ్ళు మరి!

[ తెర ]

## మూడవ దృశ్యము

తండ్రి: జ్యోస్యులవారు ఏమిటి క్షణం క్షణం గడియారం చూస్తున్నారు? సావకాశంగా చూచి చెప్పండి.

జ్యోతి: బాగానే ఉంది. షష్టిపూర్తికి మంచి ముహూర్తం చూడాలీ అంటే, నక్షత్రం బాగాఉంటే చాలు - లగ్నం అదీ అక్కరలేదు.

తండ్రి: అదికాదు. ఒక ఆదివారంనాడు ఏర్పాటుచేస్తే మిగిలిన అబ్బాయిలందరూ రావడానికి సౌకర్యంగా ఉంటుందేమో అని...

జ్యోతి: పెద్దబ్బాయి ఇప్పుడు ఎక్కడున్నారు ? ఎంత జీతం ?
తండ్రి: ఢిల్లీలో ఉన్నాడు. అయిదువందలకు పైనే వస్తుంది.
జ్యోతి: తరవాత బ్బాయి ?
తండ్రి: రెండవ అబ్బాయి కలకత్తాలో ఉంటున్నాడు. ఇంచు మించు ఒక వెయ్యి రూపాయలు సంపాదిస్తున్నాడు.
జ్యోతి: బాగుంది. అది నేను ముందే చెప్పలేదూ? శుక్రుడు ఉచ్ఛలో ఉన్నాడని! మూడవ అబ్బాయి ?
తండ్రి: మూడవవాడు వచ్చే నెలలో "రియోడిజెనిరో" బయలుదేరి వెళుతున్నాడు.
జ్యోతి: అయితే అబ్బా ఎంత దూరం! ఎక్కడ ? ఢిల్లీకి యింకా ఉత్తరంగానా ?
తండ్రి: బాగుంది మీ భూగోళశాస్త్ర పరిజ్ఞానం.
జ్యోతి: అయ్యో మా కటువంటివన్నీ ఏమి తెలుసు ? ఖగోళ శాస్త్రం అడగండి అది మా కార్యం. అరె! ఆ యబ్బాయి మీ కడసారి పిల్లవాడు కాడూ ? డ్యూటీ పూర్తి చేసుకొని వస్తున్నట్టుగా ఉన్నాడు !
ముత్తు: ఎవరు ? జ్యోతిష మొదలియారుగారా ? బాగా ఉన్నారా ?
జ్యోతి: ఏదో యిలాగ ఉంటున్నాను. మీ దయవల్ల తల మీద జేజమ్మలు మొలవకుండా ఉంటున్నాను.
ముత్తు: అదేమిటి అలాగంటారు ? మీకేం! అందరితలలు మీ చేతిలో నేకదా ఉన్నవి !

జ్యోతి: అయినప్పటికీ మీ మాదిరిగా ఉంటుందా? ఆ కాలంలో– మీ చిన్నతనంలో– ఆ చెట్టియారు పిల్లవాడికి మీవల్ల పట్టినపాట్లు.

ముత్తు: హుఁమ్ - అదొక వయస్సు. ఇప్పుడలాగ అల్లరి చిల్లరిగా ఉండటం సాధ్యమా?

జ్యోతి: బాగుంది; ఇప్పుడుకూడ అలాగే ఉండాలని మీకు ఆశగా ఉందా? బాగుంది.

తండ్రి: ముత్తూ! చేతిలో అదేమిట్రా?

ముత్తు: అయ్యో! చూశారా? మరచే పోయాను. ముగ్గురి వద్దనుండి ఉత్తరాలు వచ్చాయి.

తండ్రి: ఎవరు? పిల్లవాళ్ళ ముగ్గురివద్దనుంచా?

ముత్తు: పెద్దన్నయ్యకు ఇప్పుడు రావడానికి కుదరదట. అతని పై ఉద్యోగస్థుడు సెలవుమీద వెళుతున్నాడట; ఆ చోటులో ఇతనిని వేస్తున్నారట.

జ్యోతి: షష్ఠిపూర్తి ఉత్సవానికి పెద్దన్నయ్య రావడానికి వీలులేదా?

తండ్రి: కలకత్తా అన్నయ్య ఏమంటాడు?

ముత్తు: అతనిని బొంబాయికి బదిలీ చేస్తున్నారట. ఈ సమయంలో సెలవు దొరకదని వ్రాశాడు.

తండ్రి: బాగానే ఉంది. ఇంక చిన్నన్న దేశాంతరం వెళ్ళే సముద్రప్రయాణానికి తయారు అవుతూ ఉంటాడేమో!

ముత్తు: షష్ఠిపూర్తి ఉత్సవం డిశెంబరు మాసంలో జరుపుకోవడం వీలుకాదా అని వ్రాశాడు.

తండ్రి: మొదలియారుగారూ! విన్నారా మా అబ్బాయిల సమాచారం. పుట్టినప్పటినుండి నాలుగు మాసాలు దాటిన వెంటనే వాడికి బృహస్పతి కూడి ఉన్నాడు. మీరేదో వాడి వాక్ స్థానంలో...

జ్యోతి: అదంతా యీ కాలపు భాష. గ్రహాలుకూడ దానిని అనుసరించుకొని పోవలసిందే.

తండ్రి: అయితే ఇప్పుడేమిటి యోచన? దూరమునుండి బిడ్డలు రావడానికి వీలులేకుండా పోయింది.

జ్యోతి: యోచనకేముంది యిందులో! వాళ్ళ వాళ్ళ ఉద్యోగధర్మాలు అలాగున్నవి. అవన్నీ వదలిపెట్టి ఇక్కడికి రమ్మంటే కుదురుతుందా?

తండ్రి: ఏమిటి మొదలియారుగారూ? దీనికి ఏమిటి యోచన చేద్దామంటారు?

జ్యోతి: యోచనకేముందండి ఇందులో? మన కడగొట్టు పిల్లవాడు ఉండనే ఉన్నాడు. షష్ఠిపూర్తి ఉత్సవానికి తన సత్రంలోనే "స్వీట్సు" మయం చేసి ధారాళంగా చేయించివేస్తాడు.

తండ్రి: జ్యోతిష్కులవారూ! నే నేమో అనుకొన్నాను. ఇప్పుడు చూస్తే, సమయానికి సరిగా స్ఫురించింది.

జ్యోతి: అదే నేను చెప్పేది. కడగొట్టువాడు– అతని గురించి ఆనాడే నేను చెప్పానే. అతని జాతకం అటువంటిది. అతనికి భోజనయోగం ఉంది; భోజనయోగం!

# ధర్మపరీక్ష

రచయిత:

ము. వీరబాహు

ము. వీరబాహు వార్తాశాఖలో చాలాకాలం పనిచేసిన రచయిత. తెలిమరుగున ఉండి చక్కని శైలిలో రచన చేయగలిగిన మంచి రచయిత. ఎన్నో గ్రంథాలు అనువాదం చేసి ప్రకటించిన అనుభవమున్నవారు.

పాత్రలు

పరమేశ్వరుడు

పార్వతి

దేవతలు



# ధర్మ పరీక్ష

## మొదటి అంకము

౧

### స్థలం : కైలాసము

పార్వతి: సర్వలోక నాయకా! పశుపతీ! ప్రాణపతీ! మీకు నమస్కరిస్తున్నాను.

పరమేశ్వరుడు: సర్వలోక నాయకీ! పార్వతీ! ప్రాణసఖీ! నీకు మంగళ మగుగాక! ఏమి విశేషము? ఎందుకు పిలిచినావు?

పార్వతి: చటుక్కున ఒక సందేహము కలిగినది. అది తీర్చుకొందామని ఇక్కడికి వచ్చాను.

పర : జ్ఞానకళలో ఆరితేరిన నీకా సందేహము! అదేమిటి?

పార్వతి: అవును నాకే సందేహము. ధర్మసంవర్థని అనే పేరుతో, ధర్మము వృద్ధిచేసే భావముతో నేనున్నట్లు అందరూ నన్ను పిలుస్తారు. ధర్మం, నీతి అంటూ లోకంలో నోరు మెదపకుండా పొగడివేస్తున్నారు. కాని నిజంగా భూలోకంలో ధర్మమనేది ఉన్నదా యని?

పర : ధర్మమును పరిపాలించి సంస్థాపన చేయవలసిన నీవా యీ విధంగా సందేహపడవలసినది? నా శక్తివైన నీవు లేనిదే నేను చేయవలసినది ఏమీ లేదుకదా! నీ మూలముగానే సృష్టి స్థితి సంహార కార్యములు,

మార్పు, పరిపాలన మొదలయిన పంచకృత్యములు చేయగల్గుచున్నాను. శక్తి సామర్థ్యములు లేకుండా ఈ కార్యముల్లు చేయసాధ్య మవుతుందా? ధర్మ సంరక్షణమేకదా మన కర్తవ్యము! నీ కెందు కిటు వంటి సందేహము?

పార్వతి: స్వామీ! మీరు చెప్పినది నేను మరచిపోలేదు. కాని అదేమో అనాది కాలమునుండికూడ ధర్మం పరాజయము పొందినట్లే నాకు కనిపిస్తున్నది. అది సంభవమా! అలాగ జరుగవలసిందేనా? ఇవే నాకు సందేహములు? ఈ ప్రశ్నలే నే నడుగుచున్నాను.

పర : అదేమి? అనాది కాలము నుండి ధర్మమునకు పరాజయమా? కలియుగంలో ఈ యిరువదవ శతాబ్దములో ఒకవేళ నీవు చెప్పినది నిజము కావచ్చునేమో కాని మిగిలిన యుగములలో అది యెట్లు సంభవము?

పార్వ: స్వామీ! మన్నించండి. నేను నా సందేహము మాత్రము వెలిపుచ్చాను. ధర్మ సంస్థాపనముఅంటే అర్థం ఏమిటి? సత్యము, అహింస, ప్రేమ, పరోప కారము, మంచితనము మొదలయిన సద్గుణములతో దైవభక్తితో విశ్వాసముతో నమ్మకతో నడచు కొనేవా రుండవలెనుకదా! అలాగ లేక దుర్మార్గము, దౌర్జన్యము అసత్యము, అధర్మము, ద్వేషము వైరము చెడ్డతనము మొదలైన నడతలు నడచుకొనే వారిని దండించుటయేకదా ధర్మవిధి అనిపించుకొనేది?

దీనికి వ్యతిరేకముగా నడచినట్లయితే అధర్మము జయించినట్టేకదా అర్థము?

పర : అవును.

పార్వ: జయము అనగా ఎదుటివానిని అణచివేసి తాను పైకి వచ్చుటేకదా?

పర : అవును.

పార్వ: కలిదేవతలు నలునికి చేసిన సహాయము ధర్మమా; అధర్మమా?

పర : నిస్సందేహంగా ధర్మమే.

పార్వ: స్వామీ! నేను మీకు మూడు దృశ్యాలు చూపిస్తాను. దేవతల నడతలు, నలుడు దేవతలకోసం పాటుపడి సేవచేయడం, దేవతలు పగవూని సాధించడం, బాధించడం, ప్రాణమే తీయడానికి ప్రయత్నం చేయడం. ఇవన్నీ చేసినందుకు పొందిన ఫలమేమిటి? ఇది చూచిన తరువాత ఏది ధర్మమో మీరే నిర్ణయము చేయవచ్చును. ఈ దృశ్యాలు చూడండి.

[ తెర ]

# రెండవ అంకము

## ౧

## స్థలం : కైలాసము

[పార్వతీ పరమేశ్వరులు కొలువు దీర్చియుంటారు. నంది పడుకొని యుంటుంది. దేవతలు ప్రవేశిస్తారు]

దేవతల స్తుతి: దేవాదిదేవ హే దివ్యప్రభావ!

బ్రోవవే నీ చరణ సేవకుల మమ్ము
ఈసుప్రభాతమున నే తెంచినాము
ఈసుమాంజలుల నర్చింపగా నిన్ను
నంది ధ్వజాభరణ ! వందితామరచరణ !
నందితాఖిలభక్త బృంద బృందావనా! ॥ దేవా

శివుడు: దేవతలా ! ఇంత వేకువజామునే స్తుతిస్తూ వచ్చి యున్నారు ? ఏమి విశేషము ?

దేవతలు: అంబికాపతీ, అఖిలలోకాధిపతీ, మా దుఃఖము తీర్చగలరని వచ్చి ప్రార్థిస్తున్నాము. మా ఆర్తి తీర్చండి.

శివుడు: అట్లే యగుగాక ! మీకిప్పుడు వచ్చిన ఆపదయేమి? మీ వెనువెంటనే వచ్చుచున్నాను.

[పార్వతితోనూ నందికేశ్వరునితోసహా శివుడు లేచి బయలుదేరును.]

దేవతలు: పరమేశ్వరా ! సర్వలోకేశ్వరా ! మేము మరణమును జయించి అమరులమై జీవించగోరి పాల్కడలి మథించి అమృతము సాధించ ప్రయత్నించినాము. దానికి మేరుపర్వతమును కవ్వముగాచేసి, వాసుకిని కవ్వపు త్రాడుగా పట్టి ఒక ప్రక్క మేము, మరియొక ప్రక్క అసురులును గట్టిగా మథించినాము. ఎడమ వైపుగా వాసుకి నాలుకలు సాచియున్నవి. ఆ ముఖమునుండి కోటి నాల్కలతో విషము క్రక్కినది. ఆ విషము మన్నుమిన్నేకమైనట్లు దారుణజ్వాలలతో వ్యాపించి ధ్వంసము చేసివైచినది. ఆ విషజ్వాలలో అసురులలో ఎక్కువమంది మరణించినారు. మర

ఱించిన అయిదునాళ్ళకు మమ్ములను రక్షించగలరని మీవద్దకు వచ్చినాము. మమ్ములను రక్షించండి; మాపైన కరుణాకటాక్షము ప్రకటించండి. అదిగో! ఆ మహాజ్వాల ఆ కాలమేఘము ఆవరించుకొని మావెంట వచ్చుచున్నది.

[దూరమునుండి రెండు మేఘములు వచ్చును.]

శివుడు: భయపడకండి! నన్ను శరణుకోరిన తరువాత మీకు భయమెందుకు? ఇదిగో ఈ కాలకూటవిషమును నేనే మ్రింగివేసి బంధించగలను. మరణభయము మీకు లేదు. పదండి, తిరిగి పాలసముద్రముననే పోయి అమృతము వెలికి తీయండి. అమరులు కండి.

[ఆ కాలకూటవిషాన్ని ఒకే ముద్దగా శివుడు మ్రింగబోవును.]

పార్వతి: నాథా! నన్ను మరచిపోయినట్లున్నారు? ఎందుల కింత సాహసము. భక్తులను రక్షించు తమకములో పత్నిని మరచినట్లున్నారు. వద్దు వద్దు. ఆ కాలకూట విషమును మ్రింగవద్దు.

[శివుడు కంఠంపట్టి విషము క్రిందికి దిగజార్చకుండ అక్కడే నిలిపియుండును.]

శివుడు: పరమేశ్వరీ! సకల ప్రపంచమునకును నీవు తల్లివి కదా! నా సర్వశక్తివికూడ నీవే! నీకు ఏమి ఆపద సంభవించగలదని నీవిట్లు వారించ జూచుచున్నావు? భక్తులను కాపాడుటయే నా విధి. ఆ కార్యములో నీవుకూడ భాగము పంచుకొన్నావుకదా! సరికానీ!

నీవు కోరినప్రకారము ఈ కాలకూట విషమును నా కంఠముననే నిలిపియుంచగలను. అది క్రిందికిపోయి హాని చేయలేదు; అటు దేవతల భయముకూడ పోయినది. చూడు. విషము నా కంఠములో నిలిచిపోయి నన్ను నీలకంఠునిగా చేసివైచినది.

పార్వతి: నీలకంఠా! భక్తరక్షకా! నాకు మంగళమొసంగిన శివశంకరా! నీ కరుణయే కరుణ కదా!

దేవ: కాలకంఠ! నీలకంఠ! గౌరీమనోహరా! నమోనమః దేవరక్షకా! దివ్యమంగళా! త్యాగరాజా నమో నమః! పరమేశ్వరా! పోయివస్తాము, సెలవీయండి. ధర్మసంవర్ధనీ! పోయివస్తాము సెలవిమ్ము తల్లీ! విషమును మ్రింగి అమృత మొసంగిన నీ భర్త సాహస పరాక్రమములు, కరుణాకటాక్షములు ఇప్పుడు తెలిసినవి. దేవీ! వారికి మేము సదా కృతజ్ఞులము. వారి పేరు సదా స్మరించుకొంటాము. పోయి వస్తాము.

[దేవతలు పరమసంతోషముతో పాలసముద్రమువైపు పరుగెత్తిపోతారు.]

తెరవెనుక సంగీతము.

పాల సముద్రములోన కోలాహలమ్ము
ఆలోల విషముతా నాపెనా శివుడు
కాలకూట విషమ్ము గళములో నిలిపె
నీలకంఠుండయి నిర్జరుల బ్రోచె.

[ తెర ]

## ౨

## స్థలం : దక్షుడి యాగశాల

దక్షుడు: దేవతలారా! ఋషులారా! మునిపుంగవులారా! ఎవ్వరికిని సాధ్యముకాని యీ యాగము చాల గొప్పది. దీని ఘనతతో నా ఖ్యాతి మరింత వ్యాపించవలెను. నేను లోకములో అందరికంటె గొప్పవాడననే కీర్తి దీనితో ప్రతిష్ఠ కావలెను. అందుచేతనే ఈ యాగమునకు మీ కందరికి స్వాగతము చెప్పుచున్నాను.

యక్షుడు: దక్షరాజా! నీ కుమార్తె దాక్షాయణి భర్త ఆ కాపాలిని యీ యాగానికి రమ్మని ఆహ్వానించారా?

దక్షుడు: ఛీ! అదేమి ప్రసక్తి! పుణ్యకార్యమైన యీ యాగములో ప్రేతనాథుడైన ఆ భస్మధారియుడి ప్రశంసయా చేయునది! ఆ యనాకారిభిక్షువును నేను యాగశాలకు పిలువలేదు. ఆ భూతనాథుని చేపట్టినందున నా కుమార్తెనే నేను పిలువలేదు. సరే కానీయండి. యాగము జరుగనీయండి.

[యాగము ప్రారంభమగును; దాక్షాయణి లోపలకు ప్రవేశించును.]

దాక్షాయణి: జనకా! మీకు ఎంతటి కోపమున్నగాని నన్ను, నా పతిదేవుని ఇట్టి మహోత్సవమునకు పిలువకుండ నుండదగునా? ఇది న్యాయమా?

దక్షు : ఆఁ, నీవా ? నీ విచ్చటికి ఎందుకు వచ్చావు ? నీకు సిగ్గులేదా ? పిలువని పేరంటముగా ఇంట్లో ప్రవేశించావే ? గొడ్డుగా శుభగృహములో ప్రవేశించావే? నేనా నీకు తండ్రిని ? తల్లితండ్రి అనే లక్షణము లేకుండా ఆ శివుని వివాహం చేసుకొన్నావే! ఆనాడే నీకు నాకు అనుబంధము పటాపంచలై పోయినది. ఎముకలు, తోళ్ళు ధరించే ఆ బికారి భిక్షువునుచూచి వానిని వరించి వానిమీద తమకం తో కన్నుగానని దానవు; నాముందు నిలువవద్దు, పో!పో! బయటికి పో.

దాక్షా: అహంకార స్వరూపా ! మదాంధీభూత మనోరూపా! అజ్ఞానముచేత అన్యాయముగా పలికే జనకా ! వినండి. నా నాథుని నిష్కారణముగా దూషించినావు. ఆయనే ఈశ్వరుడు, ఆయనే రక్షకుడు. ఆయనే పరమ మంగళ స్వరూపుడు ఆయనే నీకు, నాకు అందరికీ పరమేశ్వరుడు. వారిని విడిచి అమరులులేరు; దేవతలులేరు. అయనకు తెలియని జ్ఞానములేదు. శాస్త్రములేదు, ఆయన లేనియెడల ఎవరు నీకు ఈ యాగ ఫలమీయగలరు ? వట్టి వితండవాదము చేయక వెంటనేపోయి, ఆయన క్షమాపణ వేడుకొని, పిలుచుకొని రా !

దక్షు : అమ్మాయీ ! నీవు తెలియక నన్నివిధంగా తక్కువ చేస్తున్నావు. యాగము చేసినవానికి యాగఫలము లభిస్తుంది. ఇక్కడకువచ్చిన దేవతలందరు దానికి బాధ్యత వహించగలరు. దానికి నీవూ అక్కరలేదు; నీ భర్తకూడ అక్కరలేదు. పో ! పుత్రికవై జన్మించి

శత్రువుగా మారిపోయిన పాషండురాలా— పో! నా ముందు నిలువవద్దు.

దాక్షా: దక్షా! ఇంకమీద నిన్ను నేను తండ్రి అని పిలువ దలుచుకో లేదు, అయినా ఇక్కడినుండి తిరిగిపో దలుచుకోలేదు. ఇక్కడికి పోవద్దు, ఈయవమానము పొందవద్దు అని నా పతి ఎన్నోవిధాల చెప్పినా వినక నీమీద ఆశతో ఇక్కడికి వచ్చాను. తనంత వచ్చిన దేవతను వద్దంటున్నావు. అహంకార ఫలము అను భవించు. నే నీ యాగకుండములోనే దేహత్యాగము చేసివేస్తాను.

[అట్లని యాగకుండములోపడి దహనమయిపోతుంది.]

దక్షు: ఇదేమి త్యాగము? ఇదేమి సతి? యాగ ఫలము నాశనం చెయ్యాలని ఆ శివుడు పన్నిన కుట్ర యిది. దేవతలారా! ఈ చితాగ్నులను ఆర్పివేస్తాను. అందరూ ఈ యాగహవిస్సులు స్వీకరించండి. నాకు యాగఫలము పొందజేయండి.

[తెర పడగానే పెద్ద కోలాహలము. వీరభద్రుడు భూతగణములతోసహా ప్రవేశించి యాగము నాశనముచేసి; దక్షుని తలపట్టి ధ్వంసము చేస్తాడు. దేవతలు అవమానంపొంది వికావికలుగా పారి పోతారు. శివుడు ప్రళయతాండవము చేస్తాడు.]

తెరవెనుక పాట:

క్షుద్రయాగమునకై భద్రదేవతలు
విద్రోహ నిద్రాప్రమత్తులై నిర్నిద్రులైరి
రుద్రతాండవవీర భద్రధీధితికి...

— తెర —

# మహాభవ అంకము

## ౧

## స్థలం : హస్తినాపురము

కర్ణుని గృహము : కర్ణుని వెదకుకొంటూ కుంతి ప్రవేశిస్తుంది.

కర్ణుడు: ఎవరది ? కుంతీదేవియా ?

కుంతి : అవును కర్ణా ! కుంతీదేవినే.

కర్ణుడు నీ విక్కడికి రావడం నా భాగ్యం. వీరపురుషులగన్న వీరమాత నన్ను వెదకుకొని రావడం నా ఘనతకు కారణంకాక ఏమిటి ?

కుంతి : అవును. నాయనా ! నేను వీరపురుషులగన్న వీర మాతనే అది నీకు తెలియాలనే వచ్చాను.

కర్ణుడు: అమ్మా ! ఆ మాట మీరు చెప్పేవరకు నేను తెల సుకోలేను అంటారా ? లోకం అంతా తెలిసిన సత్యము కాదా అది ? విల్లుకు విజయుడు; మల్లుకు భీముడు; మాటకు ధర్మరాజు; వీరతకు నకుల సహ దేవులు. నీ అయిదుగురు పుత్రుల కీర్తి నాకు తెలి యనిదా !

కుంతి : కర్ణా ! ఆ అయిదుగురు మాత్రమేనా వీరులు ! లోకము ఎరుగని సత్యము నీకు తెలిసినట్లయితే మరొక మహావీరునికూడ చేర్చి గుర్తించ గలవు !

కర్ణుడు: అమ్మా ! కౌరవులు మాత్రము తక్కువవారా !

వారినికూడ నీవు పుత్రులుగానే పరిగణించుకొంటావని వింటాముకదా!

కుంతి: తల్లిప్రేమకు లోటు లేదు. కాని మరొకతల్లి బిడ్డల పీరత్వానికి లోపంలేదు. గాంధారి పుత్రులను నేను నా పుత్రు లనుకోవడంలేదు. నా కడుపున బుట్టిన బిడ్డలమాటే చెప్పుచున్నాను. కర్ణా! నీవు నాబిడ్డవు.

కర్ణుడు: అమ్మా! ఎంత వింత? ఎంత విచిత్రము? నేను నీ కుమారుడనా? నా కంతటి భాగ్యమా? నమ్మలే కుండా ఉన్నాను. నా పేదరికాన్ని పరిహసించవద్దు తల్లీ! నాకు తెలిసినప్పటినుండి నే నెక్కడ పెరిగానో, ఏ తల్లి నన్ను పెంచిందో నాకు బాగా తెలియును. ఇప్పుడు నీవు నా తల్లివని చెప్పుచున్నావు. నేనే విధంగా నమ్మగలను?

కుంతి: నాయనా! నీవు నా కుమారుడవే. నేను దౌర్భాగ్య శాలిని. లేకపోతే నీవంటి పీరపురుషుణ్ణి కన్న నేను, కన్నబిడ్డ పేరు చెప్పడానికి సిగ్గుపడవలసి వస్తుందా? కన్నె వయస్సులో సూర్యదేవుని ప్రభావమువల్ల నీవు జన్మించావు. వివాహం కానిదే కన్నె బిడ్డనుకంటే ఏమి అప్రతిష్ఠ వస్తుందోయని పసిపాపవైన నిన్ను పెట్టెలోపెట్టి నదిలో వదలివేశాను. నీవు నా బిడ్డవని ఇంతవరకు నాకు తెలియలేదు. శ్రీకృష్ణుడు నాకివేళ చెప్పగానే నిన్ను చూడాలని పరుగుత్తుకొని వచ్చాను.

కర్ణుడు: అమ్మా! ఇంతకాలం తరువాత నన్ను వెదకు కొంటూ వచ్చిన కన్నతల్లివా! నా విధి యింత కఠి

నంగా శిక్షించిందన్నమాట. భారత యుద్ధంలో అర్జునుని వధించి తీరెదనని శపథం తీసుకొన్న తరువాతనా నిన్ను తెలుసుకోవడం?

కుంతి: కర్ణా! నాయనా! నేను పెంచిన బిడ్డనుగూర్చి అటువంటి మాటలనకు. అర్జునుడు నీకు తమ్ముడు. మీరిద్దరు అన్నదమ్ములు, సహోదరులు. నీ వెందుకు వానిని వధించాలి? ఈ అయిదుగురు నీకు సేవచేస్తూ నీ యడుగులు మడుగులొత్తుతూవుంటారు. నీవు వచ్చి ఏమడిగితే అది యివ్వగలరు!

కర్ణుడు: తల్లీ! జీవితము ప్రవాహమువలె ప్రవహిస్తూఉంటుంది. మధ్యలో ఎన్నోగట్లూ పుట్టలూ వచ్చినా దాటుకొని పోతుంది. నన్ను పసితనంలో శిశువుగా ఉన్నపుడు నదిలో విడిచిపెట్టివేశావు. ఒక సూతుడు రథసారథి నన్ను పైకితీసి, రక్షించి, ఎంతో మక్కువతో పెంచి, పెద్దవాడిని చేశాడు. వీరుల సభలో నన్ను అర్జునుడు అవమానించినపుడు దుర్యోధనుడు నన్ను అంగదేశ రాజ్యాధిపతినిచేసి, సరిసమానమైన సింహాసనమిచ్చి నా మానమర్యాదలు కాపాడాడు. ఇంతవరకు అతడు నన్ను నమ్మి నన్ను పెద్దజేశాడు. నన్ను సేనాధిపతిగా చేసుకొన్నాడు. పాండవులమీద పగ దీర్చుకోవడానికి నన్ను ప్రక్కబలంగా చూచుకొంటున్నాడు. అతనికి నే నెన్నోవిధాల ఋణపడి యున్నాను. అర్జునుని చంపలేకపోతే అతనికి వంచన చేసినట్లే. నాగపాశ బంధము వ్యర్థమే.

కుంతి: కర్ణా! నీవు సమర్థుడవు; కీర్తిపొందినవాడవు. నీ అస్త్ర కౌశలము, వీరపరాక్రమము లోక ప్రసిద్ధి చెందినది. నీ దానబుద్ధి అంతకంటె గొప్పది. నేను కోరిన వర మిస్తావా ?

కర్ణుడు: తల్లీ! ధర్మమే జయమనే తారకమంత్రం నమ్మి నేను నడచుకొంటున్నాను. ధర్మములలో గొప్ప ధర్మం దాన ధర్మం. అదే నాకు ప్రధాన కర్తవ్యంగా పాలించుకొంటున్నాను. అడుగమ్మా! నా ప్రాణం అడిగినప్పటికీ ఇచ్చివేస్తాను.

కుంతి: కర్ణా! అర్జునుడిమీద నీవు యుద్ధం చేయవలసివస్తే వానిమీద నాగపాశం ప్రయోగించనని నాకు వరం ఇస్తే చాలు.

కర్ణుడు: ఇస్తున్నాను తల్లీ! వీరునకు ఒక్క అస్త్రం చాలదా? గురి సరిగా ఉంటే చాలు. గురి పోతే వీరుని ప్రాణం పోయినట్టే.

కుంతి: కర్ణా! నాయనా! నీకు కన్నతల్లి చేయవలసిన సపర్యలేవీ నేను చేయలేదు. కన్నాననే హక్కు తప్ప, నీ వద్దనుండి వేరే హక్కు నాకు లేదు. యుద్ధములో అర్జునుని ప్రాణం దక్కించుకోవడంకోసం నిన్నా త్యాగం చేయమని కోరాను. నీవది అడగగానే యిచ్చివేశావు. నీవు నా యందు – నీ తల్లియందు ఏమి కావాలో ఒకటి కోరుకో.

కర్ణుడు: అమ్మా! నేను వీరుణ్ణి. నాకోసం నిన్ను ఏమీ కోరను. యుద్ధరంగంలో ప్రాణ మర్పిస్తే అది గొప్ప

చావు. వీర మరణం. కాని నాకు మరొక కోరిక ఉన్నది. నా తల్లి, నా కుమారుడితడని లోకమంతా చాటుకొని సంతసించాలి. యుద్ధంలో నేను మరణించినట్లయితే నా పుట్టుకలోని రహస్యము చెప్పి, నా మీద ప్రేమ చూపండి. అదే చాలు.

కుంతి: నాయనా! ఇప్పుడే ఆ రహస్యం చెప్పడానికి, లోకమంతా చాటడానికి సిద్ధం.

కర్ణుడు: వద్దమ్మా! ఇప్పుడు వద్దు. యుద్ధరంగంలో నేనొకవేళ మరణిస్తేనే ఆ సంగతి పైకి చెప్పండి.

కుంతి: కర్ణా! నేను పోయివస్తాను.

( తెర )

౨

## స్థలం: కురుక్షేత్ర యుద్ధరంగం

కృష్ణుడు, అర్జునుడు, కర్ణుడు, బ్రాహ్మణుడు

కృష్ణుడు: అర్జునా! ఇప్పుడు కర్ణుని మడియించి నీవు విజయం సాధించాలి. కర్ణుడు నీతో సమానమైన విలుకాడు. నీకోసమని కొన్ని ప్రత్యేక అస్త్రాలు సంపాదించి పెట్టుకొన్నాడు. నిన్ను జయించితీరుతానని శపథము కూడ చేసియున్నాడు.

అర్జునుడు: కృష్ణా! నీవు చెప్పిన ఉపాయము ఎప్పుడు ప్రయోగించను? నీవేమిచెప్పితే అది నాకు చట్టము. కర్ణుడు వీరుడు, అతనితో యుద్ధం చేయడమే నాకు ఆనం

వము, అత్యంత గౌరవమున్నూ. అంతేకాక అతడు దానవీరుడని ప్రఖ్యాతి పొందియున్నాడు. అతని కీర్తి ప్రతిష్ఠలను పోగొట్టడం మనకి అసాధ్యం: ఇంత మంచివాడినికూడ చంపవలవచ్చినదికదా!

కృష్ణు: అర్జునా! నేను చేసిన ఉపదేశం మఱచిపోయావా? నీవెవరవు? అతడెవరు? అందరును ఆ విశ్వరూపుని భ్రమలో చేరినవారేకదా? నీవిధి నీవు చేసివెయ్యి; వేరు విచారణ పెట్టుకొని తర్కించకు; అదిగో కర్ణుడు సమీపిస్తున్నాడు.

[కర్ణుడు రథమెక్కి ఎదురుగా వైరి సైన్యములనుంచి వెలువడి అర్జునునకు ఎట్ట ఎదురుగా వస్తాడు.]

కర్ణుడు: అర్జునా! ఇటువంటి తరుణంకోసం నే నెంతో ఎదురు చూస్తూ ఉన్నాను. నా యస్త్రములు నీకోసమే సిద్ధంచేసియున్నవి. నీ విలువిద్యతో నీ వీర పరాక్రమంతో నీవు కాచుకో. నేను నా ధర్మమే కవచముగా ధరించివచ్చాను. దానదీక్షయే నాకు పరమ లక్ష్యము. అడిగినవానికి లేదని చెప్పకపోవడమే నా పట్టుదల. అడుగు; నీ ప్రాణం కావాలని అడిగినా ఇప్పుడే అడుగు; తప్పించుకో!

అర్జున: సారథిపుత్రా! సహవాస దోషమువల్ల ఇంకను నీ గర్వము పోలేదు. దానవీరుడు దుర్యోధనుడు; నీవల్ల ఏవో ఫలములు సాధించాలని ఆశతో నీ కెన్నో దానాలు చేశాడు. నన్ను అవమానం చేస్తున్నావు కాని నీవు ఆతని బానిసవు. ప్రక్కబలం లేకపోతే

నీకింత దూరం సహాయం చేసియుండదు. ధనం మాత్రం వీరముకాదు; ధైర్యముతో నిలిచి యుండ టమే వీరము. నీ విల్లు నంబులు ఎక్కుపెట్టి నీ ధైర్య స్థైర్యాలు చూపించు. అవి దాచిఉంచిన కారణంచేత నీకు ప్రయోజనం ఉండదు. నీ దాన వీరత్వముగూర్చి చెప్పావే? నీ దానవీరత్వమువల్ల ప్రాణము రక్షించు కోవాలని చూస్తున్నావేమో? అది యెల్లప్పుడూ సాధ్యంకాదు. నా బాణం నీ గుండెలలో గ్రుచ్చు కొని నీ ప్రాణాలు తీసుకో బోతూవున్నదే, నీవా నా ప్రాణాలు ఇయ్యబోయేవాడివి? తనకు తాను శక్తి లేనివాడు పరులను కాపాడతాడట! నీవద్ద ఏదైనా యాచింకోవలసిన భిక్షుకుణ్ని కాను. ఆ విల్లు తీసుకో! బాణములు సంధించి విడిచిపెట్టు.

[ఇరువురు శరములు సంధించి తీవ్రమైన పోరాటంలో నిమగ్నులై యుంటారు. కర్ణుడి నాగపాశం ఒక మూల పడియుంటుంది. దానిని ప్రయోగం చేయకూడదని కర్ణుడు నిశ్చయిస్తాడు. ఇంతలో కర్ణుని రథం భూమిలో గ్రుచ్చుకొని పోతుంది. కర్ణుడు భుజంకాసి, చక్రం పైకి ఎత్తబోతూ ఉంటే అర్జునుడు వేసే అంబులు అతనిని ఏమీ చేయలేవు.]

అర్జు: కృష్ణా! కర్ణునిమీద నేను విడుస్తున్న బాణాలన్నీ అతనికి తగులకుండా అలాగే విరిగి పడిపోతూ న్నవే!

కృష్ణు: అవును. అర్జునా. కర్ణుడు చేసిన ధర్మము అతనికి

కవచమై కాపాడుచున్నది. ఉంటు, దానికి తగిన మార్గం ఆలోచిస్తాను.

[కర్ణునివద్దకు ఒక పేద బ్రాహ్మణుడువచ్చి చెయ్యిచాపును.]

కర్ణ : అయ్యా! ఈ రణరంగములో ఈ మారణ యుద్ధం మధ్యలో నా ముందు నిలిచి ఏదో కావాలని కోరుతున్నారు. ఈ సమయంలో మీకు నే నేమివ్వగలను? అయినా అడగండి; మీరు కోరింది ఇస్తాను.

బ్రాహ్మణుడు: ధర్మమే ప్రాణమైన కర్ణా! నీ ధర్మబలమే నాకు దానంచెయ్యి. అదే నేను కోరుకొనే వరం.

[అశరీరియైన సూర్యుడు: 'కర్ణా! ఇది కృష్ణుని మాయ. ఈ దానం చెయ్యవద్దు. నీ ప్రాణాలు బలి తీసుకోవడానికే ఈ పన్నుగడ! జాగ్రత్త!']

కర్ణ : ఇటువంటి యుద్ధ మధ్యంలో, ఇంత కష్ట సమయంలో నన్ను అడిగేవారుండటం, వారికి నే నివ్వగలగడం నా భాగ్యమే! ఇదే నా లక్ష్యం. ఓ బ్రాహ్మణోత్తమా! ఇదిగో స్వీకరించండి. నా ధర్మ బలం దానం చేయడానికి ఇక్కడ వీలులేదు. నా శరీరం కోసి ఈ రక్తధారలతో ఈ దానం స్వీకరించండి. అశరీరి చెప్పినట్లు కృష్ణుడేవచ్చి తనంత తాను నావద్ద చెయ్యి చాచి దానం స్వీకరించాడంటే అంతకంటే గొప్ప నా కేమున్నది?

కృష్ణు: కర్ణా! దేవతలలోనూ మానవులలోనూ నీవు ఉన్నత స్థితి నందినవాడివె. వారిలో ఎవ్వరికీ ఇటువంటి

ధర్మము చేయ సాధ్యంకాదు. తన ప్రాణమిచ్చి మరొకరి ప్రాణం రక్షించే ధర్మము నీలోనే ఉన్నది, నీ ధర్మబలం నేను ప్రశంస చేస్తున్నాను. ఈసారి అర్జునుడి అంబులకు నీవు ఎఱకాక తప్పదు.

[అర్జునుడు వేసిన బాణము కర్ణుని గుండెమీద గ్రుచ్చుకొని ప్రాణం బలితీసుకొంటుంది. ఈ ఘోరం చూచిన లోకసాక్షి సూర్యుడు ముఖం త్రిప్పుకొని అస్తమిస్తాడు.]

( తెర )

# నాలుగవ అంకము

౧

స్థలం : ఢిల్లీ

**మహాత్మగాంధీ; సార్జెంట్, దేశభక్తులు ... ....**

మహాత్మా గాంధీ: వందే మాతరమ్. హరేరామ; హరేరామ. దేశ వాసులారా! దేశ భక్తులారా! మాతలలో లోకమాత మనభారతమాత బానిసతనంలో ఉన్నది. మన ధర్మజీవనం నాశనమైపోయింది. విదేశీ వ్యామోహం మన జాతి ప్రజలను పట్టుకొని పీడిస్తున్నది. మన హిందూధర్మము కీర్తిని గోల్పోయింది. విదేశ నాగరకత, విదేశీ విజ్ఞానం మన ప్రజలకు ఆవహించింది. మన దేశంలో ఋషులు, ధర్మపరులు మహానుభావులు పూర్వం ధర్మం బోధించియున్నారు. సత్యం, అహింస, ప్రేమ మొద

లయిన ముఖ్యసూత్రాలను అనుసరించివచ్చారు. తిరిగి మన దేశం స్వాతంత్ర్యంపొందాలి. మన సంస్కృతి తిరిగి దీపించాలి. మొదట మనలో ఉన్న పగ, ద్వేషము త్యజించాలి. రామనామం జపించాలి. మన హృదయాలను తిరిగి పవిత్రం చేసుకోవాలి. ప్రేమ అనే బీజాలు నాటి సత్యము అనే ప్రాణ జలాలతో స్వాతంత్ర్యము అనే పైరులు పండించాలి. రామధున్ పాడుకోండి.

కూడ ఉన్నవారు పాడుకొంటూ ఉంటారు :

రఘుపతి రాఘవ రాజారామ్
పతితపావన సీతారామ్.
ఈశ్వర అల్లా తేరేనామ్
సబ్ కో సన్మతి దే భగవాన్
రామ రామ జయ రాజారామ్
రామ రామ జయ సీతారామ్
రఘుపతి రాఘవ రాజారామ్
పతిత పావన సీతారామ్.

మహాత్మా గాంధీ: దేశభక్తులారా! భారత పుత్రులారా! ఈవేళ దేశమంతా జెండాలు ఎగురవేసే ఉద్యమంలో ధర్మం తలయెత్తి ఆడుచున్నది. అధర్మం వంగి తల వాల్చుకొన్నది. అసురశక్తి మన ప్రజలను కొట్టి పట్టి బాధపెట్టుచున్నది. దేశ విమోచనముకోసము, మన ప్రజల స్వాతంత్ర్యముకోసము, సత్యము, అహింస, ప్రేమ అనే ధర్మములు రక్షించుటకోసము

నేను ఇంకా సత్యాగ్రహము చేయబోవుచున్నాను. సర్కారు దౌర్జన్యము నిర్బంధము మరింత ఎక్కువ కాబోవుచున్నది. నా ప్రాణము ఈ చెరసాలకే బలి కానివ్వండి. మీ ప్రాణాలుకూడ చెఱసాలలోనే క్రుగ్గిపోనీయండి. ఫరవాలేదు. దేశము తప్పక స్వాతంత్ర్యం పొందితీరుతుంది.

[పోలీసు సార్జెంటు బ్రిటిష్ సర్కార్ వుత్తరవులతో వచ్చి గాంధీజీని ఖైదుచేసి కారులో తీసుకొనిపోతాడు.]

జనుల ఘోష: మహాత్మా గాంధీకి జై. భారత మాతకు జై. మాతృ ధర్మమే మహా ధర్మం. తెల్లవాళ్ళు దేశం విడిచి పోవాలి.

౨

## స్థలం : ఢిల్లీ బిర్లా భవనంలో ప్రార్థన సభ

మహాత్మా గాంధీ: స్నేహితులారా! అహింసయే ధర్మము. ప్రేమే దైవము. మన సత్యాగ్రహ యుద్ధంవల్ల దేశం స్వాతంత్ర్యం పొందినది. కాని అంతమాత్రం చాలదు. మన రాజ్యంలో స్వాతంత్ర్యానికి సార్థకత రావాలీ అంటే మనకి స్వరాజ్యం రావాలి. జనం మంచిగా జీవించాలి. అన్ని జాతులవారికి అందరికి సంరక్షణ కావాలి. జాతి, మత, కుల భేదాలు నమసి పోవాలి. దైవ సన్నిధిలో మన మందరమూ ఒకే కులము. ఇది మరచి మన మనస్సులు ద్వేషాలతో

రెచ్చగొట్టి, కొట్లాడి, చంపుకొని మన పరిశుద్ధ తత్వాన్ని భంగపరచకూడదు. దైవభక్తి పెంపొందించుకోవాలి. సత్యము, అహింస, స్థాపనచెయ్యాలి. మీ కంఠములతో మనస్ఫూర్తిగా భగవత్ ప్రార్థన చేస్తేనే, మనస్సులు పరిశుద్ధం కాగలవు. ఈశ్వర నామమే మనకు హితము చేయగలదు. పాడండి. సంకీర్తనచేయండి. (కూడ వున్నవారు భజగోవిందం పాడతారు)

[ గుంపులోనుండి ఒకడు వచ్చి నమస్కరిస్తాడు. గాంధీజీ చిరునగవుతో హరేరామ అని అంటూఉంటారు. వచ్చిన మనిషి చేతితో తుపాకితీసి ప్రేలుస్తాడు. గుండు దెబ్బతిన్న గాంధీజీ క్రిందకు కూలిపోతాడు. హరేరామ.]

( తెర )

# అయిదవ అంకము

## స్థలం : కైలాసము

పార్వతి, పరమేశ్వరులు, నంది మొదలయిన నందిగణము, అమరులు కొలువుదీర్చి యుంటారు.

పార్వతి: పరమేశ్వరా! నేను చూపించి తాము వీక్షించిన యీ మూడు దృశ్యములును గమనించినారుకదా!

పరమే: అవును. గమనించినాను.

పార్వతి: మొదటి దృశ్యములో ధర్మ ప్రభువైన మీరు, మీమనస్సులోని కరుణచేతకదా కాలకూట విషమునే

కంఠములో ధరించి దేవతల మరణ భయము పోగొట్టి వారికి అమృతము ప్రసాదించారు. రెండవ దృశ్యములో మీ వద్ద లాభము పొందిన దేవతలే మిమ్ము అవమానముచేసి అహంకారముతో విరోధముచేసిన సందర్భము గమనించినారు. దీనియందు ధర్మము జయించినదా స్వామీ ?

పరమే: ఉమా ! వీరపుత్రుడు విజయ పతాక ప్రతిష్ఠించి రాలేదా ?

పార్వతి: స్వామీ ! అది విజయమా ? అపజయముకాదా ? సర్వసంహారంకాదా ? జయము అనగా సర్వవిజయము అనేకదా అర్థము ? కానీయండి...; రెండవ దృశ్యములో మీరేమి కనిపెట్టారు ?

పరమే: కర్ణుడు పసిపాపగా ఉన్నపుడు ఏ దిక్కూ లేకుండా నదిలో వదలిపెట్టిన తల్లికిలొంగి, ఆమె తనవద్దకువచ్చి తన కుమారునిగా ఒప్పుకొన్న సమయంలో కూడ మరొక కుమారుని కాపాడుమని వరం కోరితే ఎంత మాత్రమూ సంశయము లేకుండా అడిగినప్పటికీ కోరిన వరం ఇవ్వడం చూచాను. ఘోర సమరంలో తాను నమ్మిన ధర్మానికి బలిగా వీరమరణం పొంది యుద్ధంలో కూలిపోవడంకూడ గమనించాను. తల్లి కిచ్చిన వాగ్దానం ప్రకారం నాగపాశం అనే అస్త్రం శత్రువుమీద ప్రయోగించకుండా దాచి యుంచడం చూచాను. మాయచేసి శ్రీ కృష్ణుడు, ఆతని ధర్మబలం దానం చేయుమని కోరినపుడు, తండ్రి

సూర్యుడు ముందు వారించినదికూడ వినిపించుకోన కుండా మనస్ఫూర్తిగా కోరిన వరం ధర్మబలదానం చేయడం చూచినాను.

పార్వతి: స్వామీ! శ్రీకృష్ణుడు కపటనాటక వేషధారి అని పేరు. మీరుకూడ ఇలాగనే మాటలాడుచున్నారా? ధర్మబలం దానంచేయుట అత్యంత ధర్మము కాదా? ఆ ధర్మ మెక్కడికి పోయినది? కర్ణుని ఆ ధర్మము రక్షించలేక పోయినదికదా! అటువంటి ధర్మమూర్తి అర్జునుని అంబులవల్ల మరణించవలసివచ్చిందే. ఇది ధర్మ విజయమా?

పరమే: ఉమాదేవీ! ఇంకేమి అడగాలో అడుగు మూడవ దృశ్యములో ఏమి చూశానో చెప్పమంటావా?

పార్వతి: చెప్పండి స్వామీ.

పరమే: అహింస, సత్యము, దేశభక్తి, స్వధర్మము, భగవత్ భక్తి. ఇవన్నీ బోధించినది మహాత్ముడు. ఆతడు చూపిన మార్గములో పోరాడి, జనులు స్వాతంత్ర్యము సాధించారు. ఆతని ఉపదేశాలు వినడానికి జనం చుట్టూ చేరియున్నారు. ఆ సమయంలో జరిగిన ఘోరం నాకు తిరిగి చూపించావు.

పార్వతి: మీకు ఏది చూపించి ఏమి ప్రయోజనం? రెండు కన్నులున్న సామాన్యులకు తెలిసిన సత్యముకూడ మూడు కన్నులు కలిగిన మీకు తెలియలేదు. మహాత్మా గాంధీ మరణము ధర్మ విజయమా? సత్యమునకు జయమా? ప్రేమకు ప్రతిఫలమా?

సర్వేశ్వరా! తాము సెలవీయండి, ధర్మస్వరూపా! నా సందేహములు తీర్చండి. ధర్మము జయించి తీరాలీ అంటే ధర్మ రూపుల జీవితాలలో విజయం పొందవద్దా? వారిని ఎదిరించిన వినాశక శక్తులు నశించిపోవద్దా? ధర్మవంతులు అణగిపోయి, అధర్మ మూర్తులు పైకి పోయే మన విధానమునకు అనుమతి యిచ్చే వంచన కృత్యము, సంరక్షణ వీని అంతర రహస్య మేదియో నాకు తెలియకున్నది. నాకిదేమీ అర్థం కావడంలేదు! ఏది ధర్మం? ఏది అధర్మం? ఏది జయము? ఏది అపజయము? ఎవరికి జయం? ఇది చెప్పండి స్వామీ!

పరమే: ఉమాదేవీ! శక్తిస్వరూపిణీ! నీ కింకను అర్థం కాలేదా? నా నిష్ఠకు భంగం కలిగించావు. నేను తిరిగి నిష్ఠలోకి పోవుచున్నాను. నా భక్తులు నలు గురు నా మౌనమునుండియే సకల జ్ఞానమును తెలుసు కొన్నవారు. నేను తిరిగి శివ సమాధిలోనికి పోవు చున్నాను. నా మౌనమునుండి నీవు గ్రహించుకో.

(పరమేశ్వరుడు నిష్ఠలో కూర్చుంటాడు.)

[పార్వతి కన్నుమూసి ఏమీ తెలియనట్లు,
ఏమీ అర్థంకానట్లు కన్నీరు విడుస్తుంది.]

"ఓమ్ నమశ్శివాయ; శివోహం"

( తెర )



# 'రేపు తప్పదు సార్!'

రచయిత:

## పుదుమైపిత్తన్

తమిళసాహిత్యంలో కథానికా రచనలో శాశ్వతమైన స్థానం గడించుకొన్న ప్రసిద్ధ రచయిత. మంచి బలంగాను నిశితంగాను వ్రాయుటలో ఒక క్రొత్త శైలి ప్రారంభించిన రచయిత. కలం పట్టిన వెంటనే వచ్చివేస్తుంది ధార: రచనలోనే తన్మయించెందే మనసు. ఈయన పేరు: సో. వృద్ధాచలమ్.

## పాత్రలు :

| | | |
|---|---|---|
| వల్లియమ్మ | ... | తిరువిచారంపిళ్లై |
| కమల | ... | రాము |
| పూలపిల్ల | ... | సుందరమ్ |
| | | అయ్యరు |
| | | చెట్టియారు |
| | | గోవిందన్ |
| | | పిల్లవాడు |



# 'రేపు తప్పదు సార్!'

చెన్నపట్టణంలో ముప్పై రూపాయలతో కుటుంబం నడుపు కోవడం ఒక గారడీవిద్య. ఇది వాస్తవ ప్రపంచం అనుకొన్నప్పటికీ ఇటువంటి గారడీవిద్యగా సంసారాలు గడుపుకొనే వాళ్ళు చాలమంది ఉన్నారు. శ్రీ తిరువిచారం పిళ్ళే అటువంటి వారి కోవకు చెందిన ప్రతినిధికాకపోయినా వారిలో ఒక అంశం.

ఆయన మారిచెట్టి వీధి 371 వ నంబరు ఇంటిలో (అదికూడ సగం కూలిన ఇల్లు) కాపురం చేస్తున్నాడు. పగలు పూర్తిగా సేట్ దుకాణంలో పని, ముప్పై రూపాయల నెలజీతం. ఆయన కాపురం చేస్తున్న స్థలం వీధికి ఒక ప్రక్కగా ఉన్న చిన్న గది. ఎదురుగా ఒక చిన్నచూరు, గాలి పోవడానికి వీలులేని ఒక వంటగది - యిది ఆయన కాపురంచేస్తున్న స్థలం. ఉదయమే భార్యకు బిడ్డలకు ఉపచారంచేసి బయలుదేరితే సాయంకాలం 7 గంటలకు మాత్రం తిరిగి వస్తాడు. ఆయన వచ్చిన తర్వాతనే ఇంటి పనులను గురించి పట్టించుకొనేది.

సాయంకాలం 7 గంటలు. వీధిలోని ఎలెక్ట్రిక్ స్తంభం పెట్టిన దీపం వెలుతురు గదిలోకి వస్తున్నది. అతని భార్య వల్లియమ్మ చాపమీద పడుకొన్నది. పిల్లలు కిటికీ వెలుపల అరుగుమీద వెలుగులో కూర్చుని, ఒక వెండిగ్లాసులో గరిటవేసి దానితోకొట్టి శబ్దంచేస్తున్నారు. బయట వెళ్తూవున్న ఒకరిమాటలు; మోటారుహారన్. 'కళాయి చేస్తాము, తాళాలు వేస్తాము' అనే వాళ్ళ కేకలు, కదంబం అమ్మే పిల్లకంఠం, ఇవన్నీ వినిపిస్తున్నవి.

వల్లియమ్మ బలంగా దగ్గుతూ ఉంటుంది. రెండుసార్లు దగ్గి అలాగే ఆగిపోతుంది. తరువాత ఆ కఫం ప్రక్కనున్న బేసిన్‌లో ఉమ్మి వేస్తుంది.

వల్లియమ్మ: (దగ్గి) అమ్మా! అయ్యో! చెవులు గింగిరులు పోయేటట్టు ఏమిట్రా శబ్దం! ఊరికేనే ఉన్నారా?

పిల్లవాడు: ఊరికేనే ఉన్నామమ్మా!

వల్లి : ఆ గ్లాసులో కొంచెం మంచినీళ్ళు తీసుకురా! నాన్న గారింకా రాలేదా!

[కిటికీకి ఓరగా కదంబం అమ్మే పిల్లకంఠం.]

కమల: అమ్మా! పూవులే!

వల్లి : మంచినీళ్ళిచ్చి ఆ పిల్లను పిలు.

[ఆ పిల్లవాడు, తలుపు తెఱచి గబగబ పరుగెత్తాడు. బయట దూరంగా 'ఏ కదంబం'అని పిల్లవాని పిలుపుతో కీచుగొంతుక. కొంచెంసేపు ఇలాగగడచిన తరువాత——]

కమల: (పైకితీసి) చూడమ్మా పూలు- మంచి సువాసన! డబ్బిస్తావా?

వల్లి : ఆ సబ్బుపెట్టెలో ఒక కానీ ఉంటుంది తీసుకో!

కమల: [పిల్ల పెట్టె తెఱచి చూచి] లేదమ్మా!

వల్లి : అవును; అదిపెట్టే అగ్గిపెట్టె కొన్నానుగదా! గోమతి అత్తదగ్గరకు వెళ్ళి నే నడిగానని చెప్పి ఒక కానీ అడిగి తెచ్చెయ్యి.

పిల్లవాడు: అమ్మా! ఆమెదగ్గర డబ్బు లేదని ప్రొద్దున్నే చెప్పిందికదా! ఇప్పుడు మళ్ళీ వెళ్ళి ఎలాగ అడగను?

వల్లి : ఏం... కదంబం! నీవు లోపలికి వచ్చివెళ్ళు. నీదగ్గర రూపాయికి చిల్లర ఉందా?

పూలపిల్ల: నాదగ్గర రూపాయికి చిల్లరఉంటే పూలమ్మడానికి ఎందుకు వస్తాను? ఇందుకేనా ఇంత ఆలస్యం?

వల్లి : రేపువచ్చి తీసుకోకూడదా?

పూలపిల్ల: మంచిపని! ఇంతవరకు బోణీకూడ కాలేదు. పూలు కొంటారట పూలు? చాలు చాలు, నా పూలు ఇలా పారెయ్యి.

పిల్ల : అమ్మా! నాకు పూవులే!

వల్లి : మాటలాడకుండా ఊరుకోలేవూ? మీ నాన్న రానీ.

[దగ్గుతుంది. బయట కదంబం అమ్మే పిల్ల శబ్దం]

పూలపిల్ల: కదంబం! (కేకలు వేసుకొంటూనే పోతుంది)

తిరువిచారంపిళ్లై: (చెప్పుల శబ్దం; తలుపు తెఱచి; ప్రవేశిస్తాడు. చొక్కా విప్పి, మేకుకు తగిలిస్తాడు. ఇంతలో జేబులోనుంచి రూపాయలు, చిల్లర చెదరుచెదరుగా క్రింద పడిపోయాయి)

పిల్ల : నాన్నా! నాకు డబ్బు...

వల్లి : ఏం యింత ఆలస్యం...జీతం ఇచ్చారా?

పిళ్లై : రేపు ఇస్తారట. మన గోవిందన్‌వద్ద చేబదులు తీసు కొని ఒక్క పది రూపాయలు తెచ్చాను, రేపు తిరిగి

ఇచ్చివెయ్యాలి. మందుకి కావాలికదా! మధ్యాహ్నం నీవు మందు తీసుకొన్నావా? ఎలాగ ఉంది?

వల్లి : ఎలాగ ఉంటుంది? ఇంటి యజమాని బాడుగకోసం వచ్చిపోయాడు, స్టోర్ కుఱ్ఱవాడు బాకీ అడగటానికి వచ్చాడు. వాళ్ళు ఇద్దరూ తొమ్మిది గంటలకు వస్తారు మళ్ళీ...

పిళ్లై : వస్తే, వచ్చినట్టే పోతారు. ఇన్నాళ్ళు ఓపిక పట్టిన వాళ్ళకు ఒక్క రోజులో ఏమిటి తొందర? ఇప్పుడు కొంచెం పాలుకొని యిస్తాను త్రాగుతావా?

[స్టవ్ వెలిగించిన చప్పుడు]

పిల్ల : నాన్నా! నాకు కాఫీ!

పిళ్లై : ఇప్పుడేమి కాఫీ! పాలుత్రాగి ఏమీ అల్లరిచేయకుండా నిద్రపోవాలి. తెలుసునా?

[స్టవ్ నిలిపివేసిన శబ్దం]

వల్లి : ఎంత? పది రూపాయలా బదులు తెచ్చావు?

పిళ్లై : వస్తూ వస్తూ దారిలో కాఫీ తీసుకొనివచ్చాను. తరువాత దారిలో రామస్వామి కనిపించాడు. క్రిందటి నెలలో అతనివద్దర మనం రూపాయి బదులుపుచ్చుకొన్నాము. అది యిచ్చివేశాను. పెట్టెలో రెండు రూపాయలు ఉండాలికదా! అవికూడ చేర్చితే, రేపు మందు కొనడానికి, డాక్టరుకు ఇవ్వడానికి సరిగ్గా సరిపోతుంది.

వల్లి : అవునవును. పెట్టెలో భద్రంగా పెట్టి ఉంచాను అనుకున్నారేమో! మధ్యాహ్నం చాకలి వచ్చింది;

పాలమనిషి వచ్చింది; ఏమేమో అనివేశారు; 'అనాథలం మా సొమ్ము పట్టుకొంటే ఎలాగమ్మా దుకాణంలో డబ్బు ఇవ్వండి' అనిఅన్నారు. ఒక్కొక్కళ్ళకు ఒక్కో రూపాయి ఇచ్చి పంపించివేశాను.

పిళ్లై : మంచిపని చేశావు! నా పెట్టెలో నన్ను అడగకుండా ఎవరు చెయ్యి పెట్టమన్నారు. నేను లేనని చెప్పకూడదా? చూడు కమలం, ఆ పాత్ర కడిగి తీసుకురా! త్వరగా!

పిల్ల : ఇదిగో కడిగి తెస్తాను నాన్నా.

రాము: (బయటినుండి) తిరువిచారమ్! తిరువిచారమ్!

పిళ్లై : ఎవరు? రామూవా? ఒక్క నిమిషం! లోపలికిరా!

[తలుపు తెరుస్తాడు- చెప్పుల చప్పుడు]

రాము: ఒక్కమాట. ఆ మందుపేరు తెలుసుకొని పోదామని వచ్చాను. ఇలాగ కొంచెం రా! మరొక రూపాయి సర్దగలవా? రేపు తప్పకుండా యిచ్చి వేస్తాను. చాల అవసరం.

పిళ్లై : నీకు తెలియని దేమున్నది రాము! రేపు ఏడు గంటల లోపున డాక్టరుని చూడాలి. దానికితప్ప వేరే చిల్లర నాదగ్గర ఎక్కడుంది? నీ వడిగిన ఆ మందు స్టాకులో లేదట. దుకాణంలో యీవేళే కనుక్కొని వచ్చాను.

రాము: చాల అవసరంబాబు. మానం పోతుంది. చివరికి నీవేగతి యని నీదగ్గరకు వచ్చాను.

పిల్ల : నాన్నా ! ఇదిగో పాలగిన్నె కడిగి తెచ్చాను.

పిళ్లై : లోపలపెట్టు వస్తున్నాను. (చిల్లరయిస్తున్న శబ్దం)
ఇదిగో...

రాము: చాల థ్యాంక్సు. రేపు తప్పకుండా ఏర్పాటుచేస్తాను.
ఎప్పుడు కనిపిస్తావు ?

పిళ్లై : దానికేం ? ఫరవాలేదు. నే నెలాగో ఒకలాగ సమా
ళించుకొని వస్తానులే.

పిల్ల : (దూరంనుండి) నాన్నా ! నాన్నా !

వల్లి : మిమ్మల్నే, కొంచెం ఇలాగ వచ్చి వెళ్ళండి.

పిళ్లై : రాము వెళ్ళిపోయాడు. నే నిక్కడేకదా ఉన్నాను.
ఏం కావాలి. ఇదిగో పాలు పొయ్యిమీద పెట్టి
వస్తాను.

వల్లి : సొమ్ముపోసి కొన్న నూనె, యీ విధంగా పాడుచేసు
కుంటే ఎల్లా ? రామూకు ఏమిచ్చారు ?

[పాలు పాత్రలో పోసిన శబ్దం]

పిళ్లై : రామూకేనా ? ఒక్క రూపాయ ఇచ్చాను. దానికేం
మించిపోయింది గాని... రేపు డాక్టరును చూడ
టానికి వీలుండదనా నీ బెంగ ! దానికేమీ భయం
లేదు. ఉన్నదానితోనే కాలక్షేపంచేసి ఏలాగో సర్ది
వేస్తానుకదా !

సుందరమ్: అయ్యా ! — సార్ — సార్ — అయ్యా !

పిళ్లై : ఎవరది ?

సుంద: లక్ష్మీస్తోర్సు సార్!

పిళ్లై : సుందరమా? ఇలారా! రేపు సాయంకాలం ఐదుగంట లకు వస్తే ఇంక బాకీలేకుండా పూర్తిగా ఎకౌంటు తీర్చివేస్తాను. అయ్యరుదగ్గరకువెళ్ళి 'మా కింకా జీతాలు ఇవ్వలేదు, అందువల్ల ఆలస్యమయింది, రేపు తప్పకుండా ఇస్తాను' అని చెప్పు.

సుంద: అదేమిటిసార్! అయ్యరే స్వయంగా వచ్చారు. మీరే చెప్పండి ఆయనతో.

పిళ్లై : ఎక్కడ – లోపలికి రమ్మను. ఏం? ముందే ఎందుకు చెప్పలేదు?

అయ్యరు: (దూరంనుండి) నే నిక్కడే ఉంటాను. మీరు కొంచెం బయటికి వచ్చి వెళ్ళండి.

పిళ్లై : (వెళ్ళి) రేపటివరకు కొంచెం ఓపిక పట్టాలి. రేపు తప్పకుండా జీతం ఇస్తారు. రేపు తప్పకుండా ఇచ్చి వేస్తాను సార్! తిన్నగా ఆఫీసునుండి అలాగే వచ్చి మీ బాకీ యిచ్చివేస్తాను. సరా?

అయ్యరు: ఏమిసరో కాని మూడు మాసాలనుండి యిలాగే చెప్తున్నారు. మాకు మాత్రం వచ్చేది వస్తేకదా, పెట్టుబడి పెట్టి తిరిగి రకం మార్చడానికి వీలవుతుంది?

పిళ్లై : నాకామాత్రం తెలియదూ?

అయ్యరు: తెలిసి చేసింది ఏమున్నది?

పిళ్లై : మీకు తెలియని దేమున్నది మా సంసార స్థితి? కొంచెం శ్రమ!

అయ్యరు: ఇంటింటికి వెళ్ళి చూస్తున్నాను. ఎవరెవరి కష్టాలు వారికి తెలుసు. మూడు మాసాలుగా పదమూడు వీసాలూ బాకీలే. ఇలాగ ఎక్కవుంటులో పెట్టుకొని పోతే చివరికి ఏమిటి లాభం?

పిళ్లై : నాకు తెలియదూ? మన్నించండి. రేపు అయిదు రూపాయ లిస్తాను, జమకట్టుకొందురుగాని. మిగిలింది మూడు రోజులలో పైసలా చేసివేస్తాను.

అయ్యరు: ఈవేళకి ఏదైనా చిల్లర ఒకటిరెండు రూపాయ లుంటే ఇవ్వకూడదా!

పిళ్లై : చేతిలో ఒక దమ్మిడీకూడ లేదు. చేతిలో ఉంచుకొని లేదని అంటానా మీతో!

అయ్యరు: సరే! రేపటికైనా ఐదురూపాయలు తెచ్చి యివ్వాలి. లేకుంటే ఇంక బాకీ అనేది పెట్టడానికి వీలుండదు.

పిళ్లై : అదేమిటిసార్! మీరే అలాగంటే ఎలాగ? రేపు ఇంటికి కావాలసిన సామానులన్నీ కొనాలి. దానిలో కొంచెం హెచ్చుతగ్గులు సర్దుకొని పోవాలి! ఏమంటే ఇంకా ఒక నెలరోజులు ఈవిధంగా కొంచెం కష్టం...

పిల్ల : (దూరంలో) నాన్నా! నాన్నా! పాలు పొంగి పోయాయి. అయ్యో! ఇలారా నాన్నా!

పిళ్లై : (దూరం నుండి) ఇదిగో వస్తున్నానురా? రేపు తప్పకుండా మీ దుకాణంవద్దకు వస్తాను సార్! (లోపలికి వచ్చి) ఇదిగో! ఇలాగ చూడు. నిన్నే! ఇంతలో నిద్రపోతున్నావా? గంజిపెట్టి యిస్తాను. మెల్లిగా

ఆ మంచం కొంచెం లాగుకో- పాపా! ఆ పంచదార డబ్బా తే అమ్మా!

[పల్లియమ్మ దగ్గు వచ్చినతర్వాత హుంకారము]

పిళ్లై : ఏం? వాంతి వస్తున్నదా ? ఇదిగో యీ బేసిన్ పెట్టి ఉంచుతాను ఉండు.

వల్లి : (దగ్గి, కఫం బేసిన్‌లో ఉమ్మి వేసి) ఆ స్టోరు ఆయనకి ఏమి చెప్పి పంపించారు ?

పిళ్లై : దానిని గురించి ఇప్పుడెందుకు నీకు చింత ? ఇదిగో గంజి వార్చి పెడతాను, కొంచెం త్రాగి చూడు.

[గంజి త్రాగిన చప్పుడు. దానిని చల్లారబోసిన శబ్దం]

చెట్టియార్: (దూరంనుండి) సార్ ... పిళ్లైగారూ ! (పాజ్) అమ్మా... ఆయన వచ్చారా ?

వల్లి : ఇంటి యజమాని చెట్టియారు వచ్చినట్టున్నాడు; వెళ్ళిరండి.

పిళ్లై : చెట్టియారా ! రండి రండి లోపలికి. మీ యింటికి మీరు రావడానికి మీకేం అనుమానం ? రండి!

చెట్టి : (దూరంనుంచే) ఇంటిమాటకు వీధిమాటకు ఏంగాని ? మీరు ఒక్కొక్కమాసం ఇలాగ చేస్తూ కూచుంటే నాకు ఎంతమాత్రం పనికిరాదు. ఈ మాసమే మీరు ఇల్లు ఖాళీచేసి వెళ్ళిపోండి.

[వేగముగా నడుస్తున్న శబ్దం]

పిళ్లై : అదేమిటి చెట్టియారుగారూ ? ముందు ఏమీ ఎరుగని

వాడిని అన్నట్టు అంటున్నారు ? నా కష్టం మీకు తెలియనిదా ?

చెట్టి : నా కష్టంమాట ఎవరితో చెప్పుకోను. రేపు ఇంటి పన్ను కట్టకపోతే జరిమానా వేస్తారట (పాజ్) ఏం ? ఇప్పు డా కాఫీ చేస్తున్నారు ?

పిళ్లై : అదికాదు. ఇంటిదానికి కొంచెం గంజికాచి పోస్తు న్నాను. ఇప్పుడే ఆఫీసునుంచి వచ్చాను. కొంచెం కాఫీ తీసుకొంటారా ?

చెట్టి : ఏదీ కొంచెం ఉంటే ఇవ్వండి. దాహంగా ఉంది. నేను దుకాణంలో ఉండగా, ఆ పన్నుల ఆసామీ వచ్చి కేకలువేసి పోయాడట. రేపు మళ్ళీ వస్తాడట ఏం చెయ్యాలో తెలియడంలేదు. అమ్మగారికి ఎలాగ ఉంది పాపం ?

పిళ్లై : కొంచెం గుణమిచ్చినట్లే చెప్పాలి. రండి. ఇలాగ కూర్చుని కాఫీ తీసుకోండి. దానికేం ఫరవాలేదు. అది అక్కడే మంచంమీద పడి ఉంది.

పిల్ల : నాన్నా ! నాకో ?

పిళ్లై : అమ్మ కిచ్చినతర్వాత నీకు. నీ గ్లాసు తెచ్చుకో చూద్దాం. ఏమే, నీ విది [తాగు. బాగా చల్లారి పోయింది. [వల్లియమ్మ దగ్గు]

చెట్టి : దగ్గా ! చాలకాలంనుండి ఉన్నదా? గుండెలో చాలా నొప్పిగా ఉందా ? అమ్మ– పాపం! ఊరువదలి ఊరు మారిస్తే– నీరు పడదు.

పిళ్లై : డాక్టరు రేపు ఇచ్చే ఇంజక్షనుతో ఇప్పటికి పది ఇంజక్షన్లు అయ్యాయి.

చెట్టి : దానికి సొమ్ము?

పిళ్లై : నాకు తెలిసినవా రొకరుంటే; అతనివద్ద అప్పు తీసు తీసుకొని తెచ్చాను. రేపు జీతం రాగానే ఇచ్చి వెయ్యాలి.

చెట్టి : ఎంత?

పిళ్లై : పది రూపాయలు.

చెట్టి : అయితే నాకు అయిదు రూపాయలన్నమాట.

పిళ్లై : డాక్టరుకు కావాలి. మందుకి కావాలి.

చెట్టి : ఇంతవరకు ఆ డాక్టరుదగ్గరేకదా ఇంజక్షన్లు తీసుకొం టున్నావు. తరువాత ఇస్తాం అంటే పోతుంది.

పిళ్లై : లేదు చెట్టియారుగారూ! నాకంత చనువు ఆయ నతో లేదు.

చెట్టి : అయితే నాకు మూడురూపాయలయినా ఇవ్వాలి మరి.

పిళ్లై : చెట్టియారుగారూ! అంతా తెలిసి మీరే ఇలాగ అడుగుతున్నారే. వీలయితే ఇవ్వకుండా ఉంటానా? రేపు తప్పకుండా ఇస్తాను. రేపు తప్పదు సార్!

చెట్టి : ఏమిటి! మూడు మాసాలుగా ఇదేమాట, ఇదే నడత. ఇప్పుడు మళ్ళీ అటువంటి దగుల్బాజీతనం చేస్తూ ఉన్నావా? నా కష్టం నీకు తెలియడంలేదు.

పిల్ల : నాకు కాఫీ నాన్నా!

పిళ్లై : ఉండవే!

చెట్టి : డబ్బు ఇవ్వకపోతే సామాన్లుతీసి అవతల పారవేస్తాను. హఁ?

వల్లి : ఇదిగో! ఈ మూడు రూపాయలూ తీసి యివ్వండి. చెట్టియూరుగారూ? ఈ మాసం మీ బాకీ తీర్చివేసి ఇల్లు ఖాళీచేసి పోతాము. రాత్రివేళవచ్చి మా మాన మర్యాదలు మంటగలప నక్కరలేదు.

చెట్టి : (దూరంనుండి) డబ్బు అడిగితే ఏమయినా కోపం వస్తుంది. భయపెడ్తారు. ఖాళీచేస్తే ఇం కెవ్వరూ రారా?

పిళ్లై : ఇదిగోనే! కాఫీ కాఫీ అంటూ కాకిగోల! ఈ పాలు త్రాగి పడుకో.

వల్లి : మనకు కష్టం వస్తే పిల్లలమీద కోపపడటం ఎందుకు? పసివాళ్ళకి ఏమి తెలుస్తుంది? ఇలాగ రావే అమ్మా! పడకక్రింద ఏదో పెట్టాను చూడు.

వెలుపల కంఠం: కదంబం పైసా!

బిచ్చగాడు: అమ్మా! తల్లీ! ధర్మం చెయ్యి లక్ష్మీ! రెండు రోజులుగా తిరుగుతున్నానమ్మా! భిక్షం వెయ్యి తల్లీ!

గోవిందన్: (దూరమునుండి) తిరువిచారం! తిరువిచారం!

పిళ్లై : ఎవరది? గోవిందనా? ఏమిటి ఇంత రాత్రివేళ!

గోవిం: (వచ్చి) మా ఆవిడకు ప్రాణంమీదికి వచ్చింది. ఆపరేషన్ చేయించాలి. డాక్టరు దగ్గరికి వెళ్తు న్నాను... పది రూపాయలు ఇచ్చాను. అవి ఇప్పుడు

ఇస్తే నాకు చాల అవసరం. నా స్థితి అలా గయిపో యింది. ఏం చెయ్యను ?

పిళ్లై : అయిదు రూపాయలు మాత్రం ఉంది. దీనితో రేపు మందుకొని వెయ్యాలని చూస్తున్నాను. కాదూ కూడదూ కావాలీ అంటె ఆ అయిదు రూపాయలూ—

వల్లి : కావాలీ ఏమిటి; ముందు ఆయన కిచ్చివేయండి.

పిళ్లై : డాక్టరును చూశావా ?

గోవిం: వెళ్లే త్రోవే కదా !

పిళ్లై : ఎలాగుంటుందో ఏమిటో ! నీవు వెళ్లు, శీఘ్రం ! రేపు ప్రొద్దున్నే వచ్చి చూస్తాను. ఆలస్యం విధి విలాసం !

వల్లి : పుట్టించినవాడు రక్షించకుండా ఉంటాడా ?

కంఠం: (దూరం నుండి) రోజాపూలు – అడుగు అర్ధణా !

పిల్ల : నాన్నా ! పూలు.

వల్లి : ఏమే – నీ వింకా నిద్రపోలేదూ ?

పిళ్లై : పాపా ! అవి నీటిలోవేసిన పూవులై ఉంటాయి. నేను రేపు నీకు మంచి పేద్ద కదంబం తెస్తానుగా !

వల్లి : ఇప్పుడు కదంబం ఒకటి బాకీ ఉండిపోయింది (బల మైన దగ్గుతో) అమ్మయ్యా ! (మళ్ళీ దగ్గు)

పిళ్లై : వల్లీ, వల్లి! ఏం? వాంతి వస్తున్నదా! కొంచెం ముందుకి లేస్తావా ? తలగడ పైకి తీస్తాను. కొంచెం లేచి ఆనుకొని కూర్చోవచ్చు. నేను పరుగెత్తుకొని పోయి డాక్టరును పిలుచుకొని వస్తాను. పాపా ! అమ్మ ప్రక్కను కూర్చుండి చూస్తూ ఉండమ్మా.

పిల్ల : (ఏడుస్తుంది.)

పిళ్లై : ఏడవకు తల్లీ! ఇదిగో ఒక్క నిమిషంలో పరుగెత్తుకొని వస్తాను.

[కంగారుగా పరుగెత్తుతున్న చెప్పులచప్పుడు దూరంనుండి వినిపిస్తుంది]

[ తెర ]



# పిల్లల మనస్సు

రచయిత

ఆ. వళ్లియప్ప

పిల్లలే కవులు అనే సామెతలో సత్యాన్ని చూచి ఒక క్రొత్త ప్రపంచాన్ని కనుక్కొన్న మేధావి. పిల్లల కోసం పాటలు, కథలు, నాటకములు మొదలయినవి రచించి పేరుపొందిన అభ్యుదయ రచయిత. సాహిత్య బహుమతు లనేకం అందుకొన్నవాడు. ఎప్పుడూ పిల్లల సాహిత్యం కోసమే పాటుపడే రచయిత.

# పాత్రలు

| | | |
|---|---|---|
| మణి | ... | అత్త |
| గోపు | ... | మామ |
| బాలు | ... | |
| వసంత | ... | |



# పిల్లల మనస్సు

## మొదటి దృశ్యము

మణి వీధిలో కొంత దూరం వెళ్ళిపోయాడు.
ఇంటి వాకిలిముందు అత్త నిలుచుండి చూస్తుంది.

అత్త : అరరే! ఎవరది అలాగ వెళ్తున్నాడు ... మన మణి మాదిరిగా కనిపిస్తున్నాడే; ఔను, వాడే! మాయన్నగారబ్బాయి మణి! ఏయ్-మణి... మణి... మణీ! అరే- తిరిగి చూడనైనా చూడకుండా పోతున్నాడే! ఏమిరా మణి! అత్తను నేను పిలుస్తున్నాను; నీవిటు చూడకుండానే పోతున్నావే!

మణి : ఏం! అత్తా?

అత్త : మణీ! నిన్ను చూచి ఎన్నాళ్ళు అయిపోయిందో! మూడు నెలలు పైన దాటింది కాదూ? పోనీలే; ఇప్పుడైనా కనిపించావు. రా! ఇంట్లోకి పోదాం.

మణి : లేదు అత్తా! ఆలస్యమవుతుంది.

అత్త : ఏం? మీ అమ్మ కోపపడుతుందా?

మణి : లేదు. ట్యూషన్ చెప్పే మాష్టారు ఈవేళ రాలేదు. ఆయన్ను చూచి రావాలి, అందుకు!

అత్త : అదంతా తరవాత చూచుకోవచ్చు. మొదట్లో మా యింటికి వచ్చి మరీ వెళ్ళాలి.

మణి : ఇప్పు డొద్దు అత్తా!

అత్త : లేదు. నీవీవేళ వచ్చి మరీ వెళ్ళాలి. నే విడిచిపెట్టేది లేదు. అలాగే ఉన్నపళంగా నిన్ను ఎత్తుకొని లోపలికి తీసుకొనిపోతాను!

[అత్త మణిని అలాగే ఎత్తుకొని లోపలికి తీసుకొని పోతుంది. మణిని లోపల కూర్చోబెట్టి గదిలోకి వెళ్లింది]

అత్త : ఇందచక్కిలాలూ జంతికలంటే నీ కెంతో యిష్టం; ఈ జంతిక నీవు తిను, ఇంతలో యీ నారింజపండు ఒల్చిపెట్తాను.

మణి : అత్తా-ఇవన్నీ వద్దు అత్తా! ఇప్పుడే టిఫిన్ తిని వస్తు న్నాను.

అత్త : అదంతా పనికిరాదు. నీవు ఇవన్నీ తినే వెళ్ళాలి! మునుపు ప్రతిరోజూ ఇక్కడికి వచ్చేవాడివి. నాకు దారాలు అవీ తెచ్చి పెట్టేవాడివి! నిజం చెప్పు; మీ అమ్మేనా మా యింట్లో ఏమీ తీసుకోకూడదు, మా యింటికి పోకూడదు అని చెప్పింది?

మణి : (మౌనము)

అత్త : (విచారంతో మెల్లగా) ఉఁ-అన్నయ్య బ్రతికి ఉంటే ఇలాగే ఉండేదా? ఆయన కన్ను మూశాడు; పాత సంబంధమంతా ఎలాగ ఎలాగో పోయింది. ఏమిటో ఏమిటో అయిపోయింది.

మణి : ఎందుకత్తా ఏడుస్తున్నావు?

అత్త. లేదు నాయనా? నేను ఏడవడంలేదు. మీ నాన్న

ఉన్నప్పుడు ఇక్కడికి మాటిమాటికీ వచ్చే వాడివి. మణీ! మాకా, బిడ్డలు లేరు. రెండు కుటుంబాలకీ నీవే. పెంపుడు కొడుకివి, నిన్ను చూడకపోతే ఇన్నాళ్ళూ నా కెలాగో ఉంది. ఈ వేళ నా కెంత యిదిగా ఉందో తెలుసా? సంతోషంగా ఉంది... మణీ! ఇక్కడినుంచి రోజూ ఇక్కడికి వస్తూవుంటావా?

మణి : వస్తాను. అయితే...

అత్త : అమ్మ కొట్టుందని భయంగా ఉందా? మీ అమ్మ కేమిటో నన్ను చూస్తే పడదు! నిన్ను ఇక్కడికి రావద్దని కట్టడి చేస్తుందా? అదేమిటి నాయనా! జంతికలో సగంకూడా తినలేదే?

మణి : చాలు అత్తా! కడుపులో చోటులేదు, నిండుగాఉంది.

అత్త : ఊరికే అంటున్నావు. అదంతా తింటేనే వెళ్ళడం. ఇదిగో కాఫీ తెస్తానుండు. (లోపలికిపోయి కాఫీతో తిరిగివస్తుంది) ఇంద! కాఫీ! (మణి తొందర తొందరగా త్రాగుతాడు) అదేం నాయనా? ఒక్క గుక్కలో త్రాగివేశావు! ఎందుకంత తొందర?

మణి : ఆలస్యమవుతుందత్తా! మళ్ళీ యింకోరోజు వస్తాను.

అత్త : ఇప్పుడే వెళ్ళిపోతావా?

మణి : అవును అత్తా! టైమయిపోయింది.

అత్త : అమ్మ కొట్టుంది. అందుకేనా? సరేకాని, ఇంక మీదట నీవు తరచు వస్తూ ఉండాలి. అత్తను తప్పించుకొని పోవద్దు. ఏం మణీ!

మణి : సరేలే అత్తా! వస్తాను.

అత్త : నీ వొక్కడవు పోగలవా? నేను కూడా వచ్చి దిగ బెట్టనా?

మణి : వద్దు అత్తా! నేను జాగ్రత్తగా వెళ్ళగలనులే. వెళ్ళొస్తాను. [మణి వెళ్తాడు]

## రెండవ దృశ్యము

మణి మామగారు ఆఫీసు నుండి ఇంటికి తిరిగివస్తాడు

మామ: మీనాక్షీ! ఈవేళ ఆఫీసునుండి తిన్నగా యింటికి రావాలనే బయలుదేరాను...

అత్త : అయ్యో; అనుకొన్నట్లు తిన్నగా శీఘ్రంగా రావడానికి వీలుండదు మరి!

మామ: ఏం మీనాక్షీ? ఏమిటి సంగతి? ఏమయింది?

అత్త : మన మణి లేడూ?

మామ: ఎవరు మీ అన్నయ్య కుమారుడేనా?

అత్త : ఆఁ—వాడే. ఇంతసేపూ ఇక్కడే ఉన్నాడు.

మామ: ఏమిటి? నిజంగానా? ఆ రాక్షసి వాడి నిక్కడికి ఎలాగ రానిచ్చింది?

అత్త : వాడు వీధిలో అలాగ వెళ్ళిపోతున్నాడు, ఆ సమయానికి నేను చూశాను. వెంటనే పరుగెత్తుకెళ్ళి పిలుచుకొనివచ్చి, జంతికలు, నారింజ, కాఫీ – ఇవన్నీ యిచ్చాను.

మామ: అరె! ఇది ప్రపంచంలో ఎనిమిదవ అద్భుతంగా ఉందే! వాడు నీవు పిలిచిన వెంటనే వచ్చాడా?

అత్త: వాడికి అమ్మ కొట్టుందనే భయం ఉన్నప్పటికీ—పాపం నామీద ఉన్న ఇష్టం ఎక్కడికి పోతుంది?

మామ: అవును, మణి చాలా మంచిపిల్లవాడు. వాడెంత మంచివాడో అంత నిజాయితీగా ఉంటాడు. అబద్ధం చెప్పడు. అమ్మ వాడిని అడిగితే, వాడిక్కడికి వచ్చి పోయిన సంగతి తెలుస్తే వాడిని ఎన్నిపాట్లు పెట్టుందో తెలుసా? పాపం...

అత్త: అయ్యో! ఇది వాళ్ళమ్మకి తెలుస్తుందంటారా?

మామ: ఉ(మ్)... లేదులే. ఆమెకు ఎలాగ తెలుస్తుంది? ...

అత్త: మణి ఎంత లక్షణంగా ఉంటాడు! ఎంత సమర్థుడను కున్నారు! ఇదిగో! ఈ ఫొటో ఆల్బమ్ చూడండి; మా అన్నయ్య మణి వయస్సు పిల్లవాడుగా ఉన్నప్పుడు తీసుకున్న ఫొటో ఇది. చూడటానికి మణిలాగ లేదూ?

మామ: అచ్చు ఆకారమంతా అలాగే ఉందే!

అత్త: మా అన్నయ్య నేనంటే ఎంత యిష్టంగాఉండేవాడు! ఆయన్ను ఎలాగా చూడటానికి వీలులేకుండా చేశాడు దైవం. పోనీ మణి నయినా చూచుకొని కొంచెం మనస్తృప్తి పొందుదామనుకొన్నాను, దానికికూడా వీలులేకుండా చేసింది మా వదిన. హాఁ—ఏమిటి చేసేది?

మామ: వృథాగా మనస్సు పాడుచేసుకోకు. ఆ మురుగన్ దయవల్ల అంతా సుఖంగానే నడుస్తుంది.

# మూడవ దృశ్యము

స్కూలు విడిచిపెట్టిన తరువాత పిల్లలు వచ్చే కోలాహలం. బాలు, గోపు, వసంత, మణి- ఈ నలుగురూ కలిసి వస్తూ ఉంటారు.

బాలు: వసంతా! ఈ వేళ మా క్లాసులో మంచి తమాషా జరిగింది. కాదురా గోపూ ?

గోపు: అవునురా బాలూ, గొప్ప ఖుషీ!

వసంత: తమాషానా—ఏమి తమాషా ?

బాలు: మధ్యాహ్నం మాష్టారు రాలేదు. మాయిష్టా విలాసం.

వసం : అబ్బో; అదా! నేనింకా ఏమో అనుకొన్నాను. మాష్టారు రాకపోతే అది మీకు తమాషానా ? మా క్లాసులో కూడ తమాషాయే.

బాలు: ఏం—మీ మాష్టారుకూడ క్లాసు ఎగగొట్టి వేశారా?

వసం : కాదు కాదు. మా మాష్టారు ఈ వేళ ఒకపాట కథ చెప్పారు. అదెంత బాగుందో తెలుసా ? ఏం మణీ ? ఆ పాట ఎలాగుంది !

మణి : చాలా చాలా తమాషాగా ఉంది. నేనాపాట అలాగే కంఠతః పట్టేశాను.

గోపు: ఏది ఆ పాట—పాడూ మరి చూద్దాం !

మణి : ఊఁ —పాడమంటావా?

బాలూ అను ఒక అబ్బాయి
పండ్లదుకాణం ప్రక్కగనూ
పోతూ పోతూ చూశాడూ
మామిడిపండూ తీశాడూ

పంకు ఒడిలో దాచాడూ
పండ్ల ఆసామీ చూచాడూ
పట్టుక వానిని కొట్టాడూ
పట్టుకవానిని కొట్టాడూ
కొట్టాడూ కొట్టాడూ

బాలు: (కోపంతో) అరే! అప్పు! నన్ను వేళాకోళం చెయ్యడానికా యీ పాట! ఎవరురా పండ్ల దుకాణములోకి పోయింది; మామిడిపండు దొంగిలించినది? హూఁ?

వసం: ఎందుకురా బాలూ అంతకోపం! మా మాష్టారు చెప్పిన పాట కథేకదా మణి తిరిగిపాడాడు! నీకెప్పుడూ ముక్కుమీదే కోపం! ఎందుకంత కోపం?

మణి: అవునురా బాలూ! నేను నిన్ను వెక్కిరించాలని పాడలేదు.

బాలు: అయితే ఎందుకు నన్ను చూచి నా పేరుపెట్టి పాట పాడావు? నీకెంత పొగరు!

వసం: ఏయ్ బాలు! పాటలో నీపేరు వచ్చినంత మాత్రానికి కోపం చేసుకోవాలా?

బాలు: అలాగయితే నేనుకూడా వాడిమీద పాటపాడగలను. పాడమంటావా?

గోపు: అవునురా బాలు! నీవు నీపాట వినిపించు. కంఠమెత్తి చూపించు.

బాలు: ఇదిగో! పాడుచున్నాను. [కంఠం సవరించుకొంటూ]

మణి అని ఒక అబ్బాయీ
మణులున్న ఒక దుకాణంలో
తెల్లటి మణిని తీశాడూ
మెల్లగ నోట్లో దాచాడూ
షాపు ఆసామీ చూచాడూ
పట్టుక గట్టిగ కొట్టాడూ
పట్టుక గట్టిగ కొట్టాడూ! ఎలాగుంది నాపాట?

గోపు: జోరు జోరు. బలే జోరు!

వసం: బాలు, నీ వెలాగంటే అలా పాడుకో! దానికోసం మణి మనస్సు కష్టపెట్టుకోడు.

బాలు: కష్టపెట్టుకోడా? చూస్తూ ఉండు. కొంచెం సేపట్లో వాడిని ఏడిపిస్తాను చూడు!

వసం: అరే బాబా! నీవు అనవసరంగా ఏమి చేస్తావో!

బాలు: ఏమి చేస్తానా? తిన్నగా వాళ్ళమ్మదగ్గరికివెళ్ళి వాడు చేస్తున్న దొంగపనులన్నీ చెప్పివేస్తాను.

మణి: నేను–దొంగపనులా? ఎవరు? నేనా దొంగతనం చేసింది? ఎవరిది ఏమి దొంగిలించాను?

బాలు: సామాను ఏదీ దొంగిలించ లేదులే! ఇదొక రకం దొంగతనం. మీయమ్మ ఆవేళ నీవు స్కూలుకి బయలుదేరేటప్పుడు ఏమని చెప్పింది? జ్ఞాపకముందా? "నీవు మీ యత్త యింటివైపే పోకూడదు; వాళ్ళ యింట్లో ఏమీ తినకూడదు, ఏమాత్రం అక్కడికి వెళ్ళినా చర్మం వొలిచివేస్తాను" అని చెప్పలేదా?

మణి: అవును. ఇప్పుడు దానిమాట ఎందుకు?

బాలు: ఎందుకా ? మీ యమ్మదగ్గర చెప్పి, నీ తోలు ఒలిచే ట్టు చేయిస్తాను. నీవు నిన్న సాయంకాలం మీ యత్తయ్య ఇంటికి పోలేదూ ? అక్కడ ఏదో తిని, మూతి తుడుచుకుంటూ వచ్చావా ? అదంతా నాకు తెలియదు అనుకున్నావా ? రా! రా! సరిగ్గా దెబ్బలు తినిపిస్తాను నీకు.

మణి : ఎందుకురా బాలూ అంత కోపం ! మాష్టారు చెప్పిన పాటేకదా నేను తిరిగిపాడాను? నిన్ను గేలి చేయడానికి కాదుకదా ! దానికోసం మా అమ్మ దగ్గరికి వెళ్ళి చెప్తావా ? మా అత్తయ్య ఇంటికికూడ నాయంతట నేను పోయానా ? మా అత్తే బలవంతం చేసి పిలిచి తీసుకెళ్ళింది.

వసం: ఏయ్ బాలూ! నేనూ చూస్తూనేవున్నాను. పెద్దయిదిగా ఎగురుతున్నావేమిటి ? వెళ్ళు వెళ్ళు. మణి అమ్మ దగ్గరికి వెళ్ళి, చెప్పు. నేనుకూడ మీ యింటికి వెళ్ళి మీ నాన్నతో నీవుచేసిన దొంగపనులన్నీ చెప్తాను...

బాలు: నేను చేసిన దొంగపనులు ! నేనేం చేశాను ?

వసం : ఏం చేశావా? ఎవరో బాలూ అనే పిల్లవాడు మామిడి పండు దొంగతనం చేశాడని పాట పాడితే నీకు కోపం వచ్చిందే- నీవు మాత్రం మహా మంచివాడివా ? ఆవేళ స్కూలులో నేను ఆడుకొంటూ ఉంటే, నా పుస్తకాల సంచిలోనుంచి పచ్చ పెన్సిలు దొంగిలించావు జ్ఞాపకం ఉందా ? అప్పుడు నీ చేతులు అదిమి

పట్టుకొని పెద్దగోల చేశాను కాని ఊరికే వదలి పెట్టానా? అది తిరిగి యిచ్చేశావు కాని లేకపోతే హెడ్‌మాస్టారుతో చెప్పి గట్టిగా కొట్టించేదానిని.

గోపు: ఏమిటి బాలూ? నిజమేన్రా?

వసం: నిజంకాక అబద్ధం చెప్తానా! వీడిలాగ? మణి పెన్సిలు దొంగిలించాడా? ఏమో అత్తయ్య బలవంతం చేసి పిలుస్తే వాళ్ళయింటికి వెళ్ళాడు! అదేం తప్పా? మణి అమ్మ దగ్గరకి ఇప్పుడేవెళ్ళి వీడిని చెప్పమను; నేనుకూడ వీడి యింటికిపోయి వాళ్ళ నాన్నగారి దగ్గర వీడి దొంగతనం మాట చెప్పివేస్తాను! అంతటితో వదిలి పెట్టానా? వీడి అమ్మతో కూడ చెప్తాను. తాతతో చెప్తాను. అమ్మమ్మతో చెప్తాను; రేపు హెడ్మాస్టారుతో చెప్పి తర్వాత అందరి బడిపిల్లలతోనూ చెప్పి వేస్తాను.

బాలు: (కలవరపాటుతో); వసంతా! నేను కోపంలో ఏదో అనేశాను. తెలియక అన్నాను వసంతా!

వసం: ఊఁ—అలాగ దారికిరా! ఇంకమీద ఇటువంటి చాడీలు చెప్పవుకదా!

బాలు: చెప్పను వసంతా!... మణీ! ఇంక ముందు ఇటువంటి మాటలు చెప్పనురా!

మణి: సరి! వర్షం వచ్చేటట్టుగా ఉంది. రండి ఇళ్ళకుపోదాం.

అందరు: పోదాం! పోదాం.

# నాలుగవ దృశ్యము

స్కూలు గంట టాంగ్ టాంగ్‌మని మ్రోగుతుంది
బడి వరండాలో మణి మామ నిలుచుండి ఉంటాడు.

మామ: గంట కొట్టేశారు. ఇప్పుడు బడినించి మణి వస్తాడు. ఈ దారినే మణి రావాలి.

[పిల్లల కోలాహలం. మణి వస్తాడు.]

మామ: అదిగో మణి వచ్చేశాడు. మణీ! మణీ!

మణి : మామా!

మణి : నీవు ఎప్పుడు వస్తావో అని అరగంటనుండి కనిపెట్టు కొని ఉన్నాను. సరేకాని, నిన్ను ఇప్పుడు యింటికి తీసుకొని పోవాలని వచ్చాను.

మణి : యింటికా! ఎవరింటికి? అత్తయ్య ఇంటికా

మామ: అవును; మీ అత్తయ్య ఇంటికే.

మణి : ఉ(మ్)... వద్దుమామా! బడి విడిచిపెట్టిన వెంటనే అమ్మ యింటికి రమ్మని చెప్పింది.

మామ: ఈవేళ ఒక్కరోజుమాత్రం మాయింటికి వచ్చితీరాలి వెంటనే వెళ్ళిపోవచ్చు. రా! మణీ పోదాం!

మణి : వద్దు. ఈవేళ వద్దు. రేపు ప్రొద్దున్నే వస్తాను.

మామ: మణీ! నీతో యిక్కడ చెప్పకూడ దనుకొన్నాను. కాని తప్పలేదు. మీ యత్తయ్య కేం - ఒకటే జ్వరం.

మణి : (దిగులుతో) ఏమిటి? అత్తయ్యకు జ్వరమా?

మామ: అవును బాబూ! ఆవేళ నీవు వచ్చి వెళ్ళినప్పటినుండి మీ అత్త ఎంతో సంతోషంగా ఉంది. తరవాత రెండు మూడు రోజులు నీవు వస్తావు అని ఎదురు చూచింది. నీవుమాత్రం రాలేదు. నీవు రాని కారణం చేత బెంగపెట్టుకొని జ్వరం తెచ్చుకుంది.

మణి : అయ్యో పాపం ! తరువాత ?

మామ: ఏవేవో మందు లిప్పించాను.

మణి : ఇప్పు డెలాగుంది ?

మామ: జ్వరం తగ్గలేదు. నిన్ను చూడాలి చూడాలి– అని మాటిమాటికి నిన్ను గురించి పలవరిస్తున్నది.

మణి : అలాగయితే సరి ! రా మామా ! వెంటనే పోదాం. రా ? రా !

[ఇద్దరూ కలిసి వెళ్తారు. అప్పుడు దూరం నుండి చూచి బాలు కేకలు వేస్తాడు.]

బాలు: అరే మణి ! అత్తయ్య ఇంటికి పోతున్నావుకాదూ ? పో పో ! ఇప్పుడు నీపని పట్టాను.

మణి : (వెనుకకుచూచి భయంతో) అయ్యో ! బాలూ చూచినట్టుగా ఉన్నాడే!

మామ: మణీ ! ఎందుకు ఆగిపోయావు. భయంలేదు. రా ! అమ్మ నిన్ను కొట్టదులే, పద, నడు!

మణి : అదికాదు మామా ! నాకు భయంలేదు, అమ్మ కొట్టితే కొట్టనీ ! అత్తయ్యకు ఒంట్లో సరిగాలేదు. నేను చూచి మరీ వెళ్తాను!

## ఆరవ దృశ్యము

అత్తయ్య ఇంటికి వెళ్ళి తిరిగి వస్తూ ఉంటాడు మణి.
దారిలో బాలు ఇంటికి ఎదురుగా వచ్చి నిలుచుంటాడు.

మణి : బాలు! బాలు!

గోపు : అరే! మణియా? అత్తయ్య ఇంటిలో పెట్టిన పదార్థా లన్నీ మెలాగున్నవి? గొప్పగా ఉన్నాయా? అవునా?

బాలు: అవునవును, అంతకంటే గొప్పగా తినబోతూ వున్నాడు, పీళ్ళమ్మగారు పెట్టబోయే చపేటాలు...

మణి : అయ్యో! నేను అత్తయ్య యింటికి వెళ్ళిన సంగతి మా అమ్మకు తెలిసిందా?

బాలు: ఊఁ ... తెలియకుండా ఉంటుందా? మేము వెళ్ళి చెప్పి వచ్చామే!

మణి : చెప్పివేశారా?

గోపు : బడినుంచి తిన్నగా మీయింటికే వెళ్ళాము.

బాలు: 'వాడిని రానీ, చర్మం ఒలిచేస్తాను' అంటోంది మీ అమ్మ.

గోపు: అవునురా! జాగ్రత్త సుమా!

మణి : (కంగారుతో) ఏమిట్రా యిది? నేను మిమ్మల్ని ఎంతని ప్రార్థించాను? మా అత్తయ్యకు చాల జ్వరంగా ఉంది. ఆమె నన్ను చూడాలని యెంతో ఇదయ్యిందట. అందుకోసం మా మామ వచ్చి తీసుకొని వెళ్ళాడు. నాయంతట నేను వెళ్ళానా?

గోపు: మీ అత్తకు జ్వరమా?

మణి : అవును. ఒళ్ళు నిప్పులాగ కాలిపోతున్నది.

బాలు: నిజంగానా?

మణి : నిజం.

గోపు: పాపం – అరే మణీ! మేము ఊరికే అన్నామురా. నీవు భయపడకుండా ఇంటికి వెళ్ళు. మీ అమ్మ కొట్టదులే.

బాలు: అవునురా మణీ! వేళాకోళానికి అలాగ చెప్పాం.

మణి : లేదు. అమ్మతో మీరు వెళ్ళి చెప్పే ఉంటారు. మీరు చెప్పకపోయినప్పటికీ ఎవరో ఒకరు చెప్పి ఉంటారు. నాకు భయంగా ఉంది. నే నింటికే వెళ్ళను.

బాలు: భయపడి ప్రయోజనంలేదు. ఇంటికి వెళ్ళనంటు న్నావు? అయితే యిక్కడే ఉండిపోతాను అంటావా?

గోపు: అవునురా! కొంచెంసేపు వాడు ఇక్కడే ఉండనీ. భయం పోయినవెంటనే తీసుకుపోయి మనం ఇంటివద్ద అప్పగించి వద్దాం వీడిని!

బాలు: సరి! అందరూ రండి! లోపలికి పోయి మేడమీద కేరమ్సు ఆడుకొందాం.

## ఆరవ దృశ్యము

అత్తయ్య మంచంమీద పడుకొని దగ్గుతూ ఉంటుంది.

అత్త : మన మణి రావడం– నా కెంత సంతోషంగా ఉంది ఈ వేళ! ఇలాగే నాలుగు రోజులు వస్తే...

మామ: జ్వరమంతా తగ్గిపోతుంది.

అత్త: అవును....

[వసంత అత్తయ్య ఇంటికి వస్తుంది.]

మామ: ఎవరది? ఆడపిల్ల ఎవరో వస్తున్నదే!

వసం: అత్తా! అత్తా! ఇక్కడికి మణి వచ్చాడా?

మామ: ఏమమ్మా? ఏమిటి సంగతి వసంతా!

వసం: నేను మణి వాళ్ళ యింటికి ప్రక్కయింట్లోనే ఉంటున్నాను. మేమిద్దరమూ ఒకే క్లాసు. బడి వదలిపెట్టినా యింకా అతను ఇంటికి రాలేదు. మణి వాళ్ళ అమ్మగారు...

అత్త: (కంగారుతో) ఏమిటి? మణి యింకా యింటికి రాలేదా?

మామ: తొమ్మిదిగంట లయిందే! ఇంకా మణి ఇంటికి చేరుకోలేదా?

వసం: లేదు. ఇంకా రాలేదు. వాళ్ళమ్మగారు అన్నిచోట్లా వెదకిచూచారు. చివరికి నన్ను ఇక్కడికి వెళ్ళి చూడమని పంపించారు. ఒకవేళ ఇక్కడికి వచ్చాడేమో అని...

అత్త: వాడు ఇక్కడినుంచి అయిదున్నర గంటలకే వెళ్ళిపోయాడే!

వసం: అయిదున్నర గంటలకే వెళ్ళిపోయాడా? ఎక్కడికి వెళ్ళి ఉంటాడు?

అత్త: అయ్యో! మణిని మీరు స్వయంగా తీసుకొని వెళ్ళి దిగబెట్టవస్తే ఇలాగ అయ్యేదా?

మామ: నేను దిగబెట్టి వస్తాననే అన్నాను. వాడే అక్కర లేదని వెళ్ళిపోయాడు.

అత్త: అయ్యో! ఇప్పుడు వాడెక్కడికి వెళ్ళాడో ఏమిటో? దైవమా! నీవే వాడిని కాపాడాలి. ఇప్పుడు మనంకూడ బయలుదేరుదాము. ఎక్కడికి వెళ్ళాడో వెదకి చూద్దాం (దగ్గుతూ పైకి లేస్తుంది)

మామ: చాలు. నీ వెక్కడికి వస్తావు? వద్దు. మీనాక్షీ- ఈ జ్వరంతో నీవు లేవవద్దు. ఇక్కడే ఉండు. నేను పోయి వెదకి, మణి యెక్కడున్నా తీసుకొని వచ్చి వాళ్ళ యింట్లో అప్పగించి వస్తాను.

అత్త: నేనిక్కడ ఒక్క నిముషం కూడ ఉండలేను. నేను కూడ వస్తాను. ఇదిగో నేను బయలుదేరుతున్నాను.

[బయలుదేరుతుంది.]

మామ: మీనాక్షీ! నేను చెప్పినమాట విను.

అత్త: వద్దు. నేనుకూడ వస్తాను. నన్ను ఆపకండి. రా అమ్మా పోదాం వసంతా!

వసం: సరే అయితే. మెల్లిగా రా అత్తా!

[చెయ్యి పట్టుకొని వసంత తీసుకొని వెళుతుంది. పాజ్.]

అమ్మ: అయ్యో! నేను చూడవలసిన చోటులన్నీ చూచి వచ్చాను. ఎక్కడా ఆచూకీ లేదు. మణి యిప్పు డెక్కడ ఉన్నాడో? వాడొక్క రోజుకూడ ఇంత ఆలస్యంగా వచ్చి ఉండలేదు. ఏమయ్యాడో...?

[కొంచెం విరామం]

అత్త : ఆఁ... వసీనా! ఇంకా మణి ఇంటికి రాలేదా? అయ్యో- పిల్లవాడు ఎక్కడికి వెళ్ళాడో! (దగ్గు) భగవంతుడా! నీవే రక్షించాలి! (దగ్గు)

వసం : అత్తయ్యా! మీకు ఒంట్లో సరిగాలేదు. అనవసరంగా శ్రమపడకండి-జ్వరం ఎక్కువవుతుంది.

అత్త : జ్వరం ఎక్కువ కాసీ, ప్రాణమే పోసీ-ఇదంతా నావల్ల వచ్చిందే. మణిని చూడని బెంగచేత నాకు జ్వరం వచ్చిందని మణిని ఒకసారి పిలుచుకొని రమ్మన్నాను. (దగ్గు) వాడు, వాళ్ళమ్మ కొట్టుందనే భయంతోనే వచ్చాడు. మా యింట్లో సరిగా ఒక అరగంటకూడ లేడు అయిదున్నర గంటలకే వెళ్ళిపోయాడు. (దగ్గు)

మామ: వాడు మా యింటికి రావడం చూచి ఒక పిల్లవాడు మీ అమ్మతో చెప్తానుండు అని బెదిరించాడు. ఒక వేళ వాడు చెప్పితే అమ్మ కొట్టుందనే భయంతో ఎక్కడికైనా పారిపోయాడో ఏమిటో!

వసం : అవునవును. భయంవల్లనే పారిపోయివుంటాడు. మణి, నాతో మాటి మాటికి చెప్పేవాడు- 'అత్తయ్య ఇంటికి వెళ్తే అమ్మ కొట్టుంది. అమ్మ చావజంపుతుంది' అని. నాతో చాలసార్లు చెప్పేవాడు.

అమ్మ : నేను కొట్తాననే భయంవల్లనే వాడు పారిపోయి ఉంటాడు. అయ్యో! నేను పెట్టిన కట్టడివల్ల వచ్చింది. పిల్లవాడు పసివాడు. ఒకే ఒక బిడ్డ. వాడేమిచేసినా గొప్పగా ఉండాలని వాడికి భయంపెట్టి ఉంచాను.

అయ్యో! అది యెంత విపరీతంగా మారిపోయింది! ఇప్పుడు నేనేమి చేసేది?

అత్త: నేను పాపాత్మురాలిని. నా ముచ్చట తీర్చడానికి మణిని తీసుకొనిరమ్మని పిలిపించాను. (దగ్గు) మా యింటికి రాకుండాఉంటే ఇలా జరిగి ఉండదుకదా... (దగ్గు) ఇదంతా నామూలాన వచ్చిందే...

అమ్మ: లేదు మీనాక్షీ! నీవంటే వాడికి పంచప్రాణాలున్నా. నేను అడ్డు పెట్టకుండా, వాడి యిష్టం వచ్చినట్టు వదలిపెట్టివుంటే, ఈ విధంగా జరిగి ఉండేదా? ఇదంతా నా మూలాన వచ్చిందే.

వసం: సరి! సరి! మీ రిద్దరూ నా మూలాన వచ్చింది నా మూలాన వచ్చింది అని చెప్పుకొంటూ ఉంటే, మణి తనంత తాను వస్తాడా?

[కొంచెం విరామం]

బాలు, గోపు: అరే, అరే; ఎందుకురా పారిపోవాలని చూస్తు న్నావు? మాటలాడకుండా రారా! ఇదేమి భయం! భయపడకుండా రారా!

వసం: అదిగో! ఎవరో వస్తున్నట్టున్నారు. ఆ ప్రక్కనుంచి వస్తున్నారు. బాలూ! ఈ ప్రక్కన, యిలాగ! గోపు, ఇలాగ రండి. అరె! మణి! – మన మణి!

అత్త: (ఆనందంతో) ఏమిటి? మన మణియేనా?

అమ్మ: అవును. వాడే. నా నాయనే!

మామ: అవునవును. వాడేనమ్మా.

మణి : అరరే! నన్ను విడిచిపెట్టండి. నన్ను మా అమ్మ చావమోదుతుందిరా!

అమ్మ: మణీ! బాబూ! నిన్ను ఇంక కొట్టను. భయపడకుండా రా!

మణి : లేదు. నీవు కొట్టావు. అత్తయ్య ఇంటికి వెళ్తే చర్మం ఒలిచేస్తానని చెప్పావు.

అమ్మ: ఇంక అలాగనను నాయనా! రా! ఎవరు వచ్చారో చూడు ఇక్కడికి?

అత్త : మణీ!

మణి : అత్తా! నీ విక్కడ కెలాగవచ్చావు? జ్వరంతోటి మా అత్తయ్య ఇక్కడ కెందుకు వచ్చింది?

అత్త : నీవు కనిపించడం లేదనే మాట విని దుఃఖం ఆపుకోలేక, ఇంట్లో నిలువలేకపోయాను. ఇంతసేపూ ఎక్కడికి వెళ్ళిపోయావు బాబూ!

బాలు: వీడు మీ యింటిదగ్గరనుంచి రాగానే, 'ఒరేయ్! మీ అత్తగా రింటికి వెళ్ళావు చూడు, మీ అమ్మతో చెప్పి కొట్టిస్తాము' అని వేళాకోళంగా అన్నాము. అది నిజమే అనుకొని వీడు భయపడిపోయి, మా యింటిలోనే ఇంతసేపూ కాలక్షేపం చేస్తూ వుండిపోయాడు. చాలసేపు అయిపోయిందని చెప్పి, వీడిని పెట్టుకొని తోడుగా ఇక్కడికి వచ్చాము.

అమ్మ: మణీ! ఇంకమీద నిన్ను కొట్టనురా బాబూ! నిన్ను తిట్టనుకూడ తిట్టను. ఇంక మీదటనుంచి మీ యత్తయ్య ఇంటికి హాయిగా వెళ్ళవచ్చు.

అత్త : నిజమేనా వదినా?

అమ్మ: అవును మీనాక్షీ! ఇన్నాళ్ళనుండి ఉన్న మన బాంధవ్యం మఱచిపోకుండా ఉండవచ్చు.

అత్త : ఆః! మణీ! నాయనా! ఇలాగరా? ఏదీ నీ కన్నులు చూపు. (ముద్దు పెట్టుకుంటుంది. గాద్గదికంగా—) మణీ! నిజం చెప్తున్నాను; ఇప్పుడే నా జ్వరం తగ్గిపోవడం ప్రారంభించింది!

వసం : రేపటి సాయంకాలానికి జ్వరమంతా పూర్తిగా తగ్గిపోతుంది. అంతేనా! అత్తా!

[ అంతా నవ్వుతారు ]

తెర



# ఓ టు విం

రచయిత

## యన్. చిదంబర సుబ్రహ్మణ్యాం

చిన్నకథలు, నాటకాలూ వ్రాసి తమిళుల హృదయాలు చూరగొన్న రచయిత. ఆంగ్లము, సంస్కృతం చదివి వాని లోని మెరుగులతో తమిళం రచించే శక్తిగలవాడు. ఎన్నో రచనలు పుస్తకాలుగా ప్రకటించి పేరు ప్రఖ్యాతులు పొందినవాడు.

# పాత్రలు

| | | |
|---|---|---|
| భానుగోపుడు | ... | చంద్రముఖి |
| మార్తాండుడు | ... | చెలికత్తె |
| విక్రముడు | ... | |
| వీరులు | ... | |

# ఓ ట మి

అడవిలో ఒక విడిది. రాజకుమారి చంద్రముఖి కూర్చుంది ఉంటుంది. ప్రక్క చెలికత్తె నిలుచుంది ఉంటుంది.

చంద్రముఖి: చెలీ! మనమీ వనము విడిచి ఎప్పుడు బయలు దేరుతున్నాము?

చెలికత్తె: రేపు తెల్లవారు ఝామున బయలుదేరుతున్నా మమ్మా?

చంద్ర: ఎప్పటికి మన ఊరు చేరుకొంటాము?

చెలి : రేపుకాక మరునాటికి ఊరికి చేరుకోగలము.

చంద్ర: ఏమి? యింతవరకు మా తండ్రిగారు విక్రమపురిమీద దండెత్తివెళ్ళి విజయము చేపట్టిన వార్త యింకా తెలియలేదు. ఆ విజయం చేకూరేవరకూ విశ్రాంతి లేదు; విరామం లేదు. వేరే ఆలోచనే లేదు, తలంపు లేదు. నన్నుకూడ ఇక్కడికి తీసుకొని వచ్చారు. సరే! పద... ఆ వీణ యిలాగ తీసుకుని రా!

[చెలికత్తె వీణ తీసుకొనివచ్చి అక్కడ పెట్టుంది]

చెలి : ఈ వీణ మీ కెంతో నచ్చినది.

చంద్ర: విక్రమపురినుండి ఎన్నో రత్నాలు, ఆభరణాలూ మా నాయనగారు నాకు తెచ్చి కానుకలుగా యిచ్చి నారు. కాని యీ వీణ చూచిన తరువాత ఇంకేదీ నాకు అక్కరలేదు అని అంటున్నాను. ఏమి నాదము!

ఎటువంటి నిర్మాణము! ఎంత అందమైన ఆకారము!
మన అంతఃపురం అలంకరించడానికి ఇదొక్కటి చాలు.

[వాయించడం మొదలుపెడుతుంది, ఫకాలున నవ్వినట్లు వినిపిస్తుంది.]

చంద్ర: ఎవరూ నవ్వుతున్నారు? పోయిచూడు!

చెలి: (పోయి చూచివస్తుంది) ఎవరో దేశాంతరం పోయే బాటసారి. తమరు శ్రుతి సరిగా లేకుండానే వీణ వాయించడం మొదలుపెట్టారని నవ్వుతున్నాడు.

చంద్ర: (గర్వంతో) అతనిని పిలుచుకొనిరా. వాని సామర్థ్యం ఏమిటో చూద్దాం. మహాగర్విష్ఠిలాగ కనిపిస్తున్నాడు.

[చెలికత్తె బయటకువెళ్ళి బాటసారిని పిలుచుకొని వస్తుంది.]

చంద్ర: నేను వాయిస్తున్నది సరిగా లేదంటారా!

బాటసారి: నే నలాగ అనలేదే! వాయిద్యం సరిగా శ్రుతిలో చేరలేదనిమాత్రం చెప్పాను.

చంద్ర: మహా జ్ఞానస్థుడిలా మాటలాడుతున్నారే! మీకు వీణ వాయించడంలో మంచి సాధన ఉందా?

బాట: ఏదో కొంచెం తెలుసు. శ్రుతి చేరలేదని తెలుసుకొనేటంత నేర్పూ జ్ఞానమూ ఉంది.

చంద్ర: ఏదీ, కొంచెం వాయించి చూపండి చూద్దాం.

బాట: వాయిస్తాను. కాని నా వాయిద్యం మీకు నచ్చితే బహుమతి దొరుకుతుందా!

చంద్ర: దొరుకుతుంది.

బాట: నేను కోరింది ఈయవలసి వుంటుంది.

చంద్ర: అలాగే యిస్తాను.

[గాయకుడు వీణ సరిగా శ్రుతిచేసుకొని వాయిస్తూ ఉంటాడు. ఈ వీణాగానం సుకుమారమైన పిల్ల తెమ్మెరలాగ మెల్లిగా ప్రారంభమై హెచ్చుతుంది. మనోమోహనమైన ఆ మాధుర్యానికి చొక్కి దానిలో లీనమైపోతుంది చంద్రముఖి.]

చంద్ర: ఎంత చక్కని వాయిద్యం! ఏమి నేర్పు! మా రాజ్యంలో ఇంత సమర్థంగా వీణ వాయించేవారు లేరు. మీవద్ద ఆ వీణ ఎంతగానో శోభిస్తూ ఉన్నది. ఆ వీణ వాయించడానికి నా కెంత మాత్రమూ యోగ్యత లేదు. మీరు పరిహాసించడం న్యాయమే. మీ కేమి కావాలో కోరుకోండి!

గాయ: తప్పకుండా ఇస్తారా?

చంద్ర: తప్పకుండా ఇస్తాను. దానికి సందేహమెందుకు?

గాయ: ఆ వీణే నాకు కావాలి!

చంద్ర: (కొంచెం ఆశ్చర్యంతో) మా నాయనగారు విక్రమపురమునుండి ప్రత్యేకంగా తెచ్చిన యీ అమూల్య వస్తువు నా కెంతో ప్రియమైనది. అది అడుగుతున్నారే! ఇదే మీకు ముఖ్యంగా కావాలీ అంటారా?

గాయ: విక్రమపురిలో మాత్రమే కాదు; ఈ ప్రపంచంలోనే ఈమాదిరి వాయిద్యము లభ్యం కాదు.

చంద్ర: ఈ వీణ అంటే ఇంత గొప్పగా చెప్తున్నారే—ఈ వీణ మీరు ముందే వాయించి చూచారా?

గాయ: (నిదానంగా) ఇది నా వీణ.

చంద్ర: ఇది మీ వీణా? మరి రాజాంతఃపురానికి ఎలాగ వచ్చింది?

గాయ: విక్రమపురి రాజుగారికి నేనిది కానుకగా ఇచ్చాను.

చంద్ర: మీ రాజుగారికి కానుకగా ఇచ్చారా? ఆయనకు ఎందుకిచ్చారు?

గాయ: మా రాజు సంగీతంలో గొప్ప ప్రవేశమున్నవాడు, నాకు చెలికాడు. మేము ఇద్దరమూ ఒకే గురువువద్ద సంగీతం నేర్చుకొన్నాము. నాతో సమానంగా అతడూ వీణ వాయించగలడు.

చంద్ర: (హేళనగా) ఆటపాటలతో ఆనందంగా కాలక్షేపం చేసిన కారణంచేతనే యేమో ఆ రాజు మా తండ్రి గారిచేత ఓటమి పొంది రాజ్యము కోల్పోయా డను కొంటాను.

గాయ: లేదు లేదు. మీరనుకొన్నది సరికాదు. మీ తండ్రి గారి సైన్యంలో ఎనిమిదిలక్షలమంది బలం ఉంది. విక్రముని సైన్యంలో లక్షమంది బలంకూడ లేదు. మీ తండ్రిగారి సైన్యంలో ఏనుగులు, గుఱ్ఱాలు అసంఖ్యాకంగా ఉన్నవి. విక్రమునివద్ద అవి మచ్చుకు కూడా లేవు.

చంద్ర: ఆ కారణంచేత ఓటమి ఒప్పుకోవాలా? చివరివరకు యుద్ధం చేయకూడదా?

గాయ: ఓటమి తప్పదని తెలిసిన మా మహారాజు, లక్షల మంది జనాన్ని యుద్ధభూమికి బలియిచ్చి, వారి

ప్రాణాలు, జీవితాలూ నాశనం చెయ్యాలని కోరలేదు. లక్షలాది జనం ప్రాణాలతో జీవితాలతో మిగిలినప్పుడు, ఓటమి అంగీకరించడంలో పోయింది ఏమిటి అను కొన్నాడు. అందుచేతనే అతడు రాజ్యం విడిచి పారిపోయాడు.

చంద్ర: దండయాత్ర అనేది వచ్చి తీరుతుంది అనే భావన మీ రాజుగారికి ముందు తెలియలేదా ? తెలిసి ముందు జాగ్రత్త తీసుకోలేదా ?

గాయ: ఆయనకి తెలియకపోలేదు. మీ తండ్రిగారు దండ యాత్రకు వచ్చింది ఇటీవలనే. దానికి తగినట్లు ఎదురుసన్నాహాలు చేసుకోవడానికి వీలులేకపోయింది మా మహారాజుగారికి. అదీగాక ఆయన మనస్సులో ఒక తీవ్రమైన పోరాటం అంతకుముందే సాగుచూ వున్నది !

చంద్ర: ఏమి పోరాటం ?

గాయ: బుద్ధుడు అశోకుడు మొదలయినవారు జన్మించిన యీ దేశంలో ఇంకా పశుబలం తాండవమాడుతూ ఉండడం చూచి మా రాజు మనస్సు కష్టపెట్టుకొనే వాడు. ఒకరాజు మరొక రాజ్యాన్ని జయించడం అనేది వస్తే, ఆయుధాలచేతా అస్త్రాలచేతా కాదు, ప్రేమాభిమానాలతో జయించాలి అనేవాడు. రాజు రాజ్యం చేయవలసింది ప్రజల మనోరాజ్యంలోనే అని ఆయన భావన.

చంద్ర: ఏదో ఒక లక్ష్యము పెట్టుకొని దానిని అనుసరించే ఆదర్శవాదిలాగు కనిపిస్తున్నాడు మీరాజు.

గాయ: అతడు ఎల్లప్పుడూ కలలుకంటూ ఉండేవాడు. అతని హృదయం కళా హృదయం.

చంద్ర: ఏమి ఆశ్చర్యం! అయితే ఆయన వీరుడు కాడన్న మాట!

గాయ: వీరుడే. పేదల కష్టదుఃఖాలు చూచి హృదయం క్రుంగిపోయే వీరుడు. ప్రజల కష్టాలుచూచి మనస్సు కలవర పడిపోయే వీరుడు. అయితే అతడు తన వీరత్వము సృజనాత్మకమైన కార్యాలలో మాత్రమే చూపించే కళావీరుడుకూడ.

చంద్ర: ఆయన ఇప్పు డెక్కడున్నాడు ?

గాయ: నాకేమి తెలుస్తుంది ? నేను వెళ్ళిరానా మరి ?

చంద్ర: కొంచెం ఉండండి. మా నాయనగారు వస్తున్నారు. ఆయనకు మీ వాయిద్య నైపుణ్యం, మీ గానకళా ప్రావీణ్యం చూపింతురుగాని.

గాయ: (ఇష్ట లేనట్టు) నా కాలస్యం అయిపోతున్నదే.

చంద్ర: కొంచెంసేపాగి పోవచ్చును.

[భానుగోపుడు ప్రవేశిస్తాడు.]

చంద్ర: (లేచి) నాయనగారూ! ఈయన ఒక గొప్ప వైణికుడు. ఈయన వీణావాయిద్యం కొంచెం మీరు వినాలి.

[చంద్రముఖి తలతో సైగచేస్తుంది. గాయకుడు వీణా గానం చేస్తాడు. భానుగోపుడు గాయకుణ్ని శ్రద్ధగా గమనిస్తూ ఉంటాడు. పాట పూర్తి అవుతుంది.]

భాను: పాట చక్కగా ఉంది. వేషం మాత్రం సరిగాలేదు.

[గాయకుడు ఆశ్చర్యంతో చూస్తాడు.]

చంద్ర: (ఆశ్చర్యంతో) ఏమిటి? ఏమిటి మీరనేది?

భాను: నీకు తెలుసుకోవాలీ అంటే ఇదిగో చూడు!

[గాయకుని గెడ్డం పీకివేసి చూపిస్తాడు. అది చేతితో వచ్చివేస్తుంది.]

భాను: విక్రమా! నిన్ను జయించి, నీవు ఓడిపోయిన వాడివని మాత్రం భావించాను. నీవు పిచ్చివాడివని కూడ ఇప్పుడు తెలిసింది.

విక్రముడు: పిచ్చివాడినే! కళ అంటేను, భగవంతుడంటేను పిచ్చియెక్కిన వాడినే. పశువువలె అహంకారంచేత దౌర్జన్యంచేత మదించిన నీకు, వీటి అంతర్యం ఏమి అవగాహన కాబోతుంది?

చంద్ర: (మరింత ఆశ్చర్యంతో) విక్రమ మహారాజా! ఈయనేనా?

భాను: వలలో చిక్కుకొన్న లేడిలాగ యిక్కడికి వచ్చి యెందుకు చేరుకొన్నావు?

విక్ర: నా వీణ నేను తిరిగి తెచ్చుకోవాలని ఇక్కడికి వచ్చాను.

భాను: నీకు ఎటువంటి అపాయం మూడిందో గ్రహించలేవా? అంత సులభంగా మోసం చేయగలనని భావించావా?

విక్ర: నా వీణ నేను తీసుకొని పోవాలనే అభిమానమే నన్నింతవరకు లాగుకొని వచ్చింది.

భాను: నీకుగల ఈ కళా వ్యామోహమే నిన్ను రాజ్యంనుండి అవతలికి పారిపోయేటట్టు చేసింది. పారిపోయిన తర్వాత కూడా ఈ కళా వ్యసనం విడువలేనట్టుగా ఉంది.

విక్ర : మనిషిమీది మమత, కరుణే నన్ను రాజ్యం విడిచి పెట్టేటట్టు చేసింది; కళా వ్యామోహం కాదు.

భాను: భీరుత్వానికి అహింస అనే పేరు ఎక్కడా లేదు.

విక్ర : భీరుత్వం కాదు. కసాయివాడు కాణంలో పీకలు తెగ కోసినట్టు లక్షలాది ప్రజలను బలియిచ్చే పనికి వీరత్వ మనీ విజయమనీ చెప్పుకొనే అంతవరకు నేను చేసిన కార్యం పిరికితనంగానే కనిపిస్తుంది.

భాను: యుద్ధం అనేది క్షత్రియ ధర్మం; నీవు మాటలాడే మాటలు మహారాజు మాటలులాగ లేవు.

విక్ర : అశోకుడు నీకంటే మహా విశాలమైన సామ్రాజ్యాన్ని జయించి స్థాపనచేశాడు. అయితే ఆతడు పొందిన అనుభవం వేరు. ఆత్మబలమే గొప్ప బలమని తెలుసు కొన్న కౌశికుడు కూడ క్షత్రియుడే. ఈ పశుబలం తాండవమాడుతూ ఉన్నంతవరకు ఈ లోకంలో శాంతి లేదని తెలుసుకొని స్వానుభవంవల్ల గ్రహించాడు. ఎవరు పైనో ఎవరు క్రిందనో అనే భేదం పోతేనేతప్ప, ఈ వ్యవస్థలో ప్రేమానురాగాలకి తావే ఉండదు.

భాను: ఈ వేదాంతం అంతా నాకు తెలుసు. కాని ఇంక మీదట జరుగవలసిన కార్యాలగురించి ఆలోచిస్తాను. నా చేతిలో స్పష్టంగా కనిపిస్తున్నది. నీలో

నశించిపోయిన శక్తి నా చేతిలో ఉంది! నీ అహింస, నీ కరుణ, నీ ఆత్మబలం నిన్ను కాపాడబోతున్నవా?

విక్రమా: అదిగో చూడు; ఆ ఈగ. బల్లి దానిని పట్టుకోవాలని పొంచి ఉంది. ఆ బల్లికోసం ఒక పిల్లి పొంచి చూస్తున్నది. నీ శక్తి వట్టి పశుబలంతో కూడినది. మనిషి మనసులోని మానవతను గోల్పోయి, పశువువలె బల ప్రయోగం చేయడమే ఈ కాలంలో గొప్పవిద్యగా పరిణమించింది.

భాను: ప్రేమమార్గమూ అహింసా ధర్మమూ నిన్ను ఈ ఆపదలో కాపాడబోతూన్నవా?

విక్ర : భగవంతునిమీద విశ్వాసం ఉంటే నాకు విజయం కలిగిస్తుందనే నమ్మకమున్నది.

భాను: ఎవరక్కడ?

[యిద్దరు వీరులు అక్కడికి వస్తారు]

భాను: వీరిని తీసుకుపోయి శిరచ్ఛేదం చేయండి.

చంద్ర: నాయనగారూ! కొంచెం [illegible] ప్రతినిని నా[illegible]ం విడిచిపెట్టి వెయ్యండి.

భాను: చంద్రముఖి! నీ విందులో తలదూర్చవద్దు. ఇవి రాజకీయాలు.

చంద్ర: ఇవి రాజకీయాలు మాత్రమే కాదు; వీనిలో సంగీత సాహిత్యాలు కలిసియున్నవి.

భాను: ఏమంటున్నావు?

చంద్ర: ఆయన మాటలాడే మాటలూ పాడిన సంగీతమూ

ప్రకటించిన గుణగణాలూ నన్నూ నా మనస్సునూ ఆకర్షించి వేశాయి.

భాను: అతడు నాకు శత్రువు. అతని రాజ్యం నేను జయించాను.

చంద్ర: నా హృదయ రాజ్యాన్ని అతడు జయించాడు.

భాను: ఇటువంటి సంఘటనలు చరిత్రలో ఎన్నో జరిగియున్నవి. దానిలోలాగే ఈతడుకూడ, దీని తర్వాత మరణించి తీరవలసిందే.

చంద్ర: నిరాయుధపాణిగా నిలిచియున్న ఈతనిని చంపడం న్యాయమేనా ?

విక్ర : ఆయుధబలమే పనికిరాదని త్రోసిపుచ్చిన మా రాజ్యాన్ని ఆక్రమించుకోవడం మాత్రం న్యాయమా?

భాను: ఇదంతా రాజ్యతంత్రము, రాజ్యాంగ నీతి. నీ కార్యం నీవిక చూచుకో.

[బయట పెద్ద కోలాహలం వినిపిస్తుంది. ఏదో కలవరం, కత్తీ-డాలూ కొట్టుకొన్న శబ్దం వినిపిస్తుంది. బయట ఏదో అల్లకల్లోలంగా ఉన్న శబ్దం]

భాను: బయట ఏమిటా గోల? (ఆశ్చర్యంతో అడుగుతాడు)

విక్ర : ఇదికూడ రాజ్యతంత్రమే! రాజ్యాంగ నీతే! నేను రహస్యంగా ఆయత్తంచేసి ఉంచిన వీరులు నీ కాపలా సైన్యాన్ని ధిక్కరించి లోపలికి ప్రవేశించి నిన్ను బంధించడానికి వస్తున్నారు.

భాను: ఏమిటి ? ఇది నిజమేనా ?

[ఒక సేనాపతి వేగముగా వచ్చి విక్రమ మహారాజుకి నమస్కరిస్తాడు]

విక్ర : మార్తాండా ! ఈయనను ఖైదు చేయించండి.

[భానుగోపుని మీదికి కత్తులు దూసి ఇద్దరు వీరులు సమీపిస్తారు. భానుగోపుడు వెంటనే పారిపోవడానికి ప్రయత్నం చేస్తాడు. అతనిని పారిపోకుండా భటులు పట్టి బంధించి వేస్తారు. ఆతొందరపాటులో అతని కిరీటం క్రిందపడింది]

విక్ర : భానుగోప మహారాజా ! ఇప్పుడు బోధపడిందా ! నా సేనలు మీరు వచ్చేవరకు పొంచివుండి స్వాగత మివ్వడానికి కాచుకొని యున్నవి. కొంచెం సేపటి క్రితంవరకు నేను బుద్ధిలేని పిచ్చివాడిలాగ కనిపించాను. ఇప్పుడు మీకు పట్టింది ఆ బుద్ధిమాంద్యం. నేనిప్పుడు తలచుకొంటే నాశనంచేసి విడువగలను. కాలం మారిపోయింది. విధి విపరీతంగా వెక్కిరిస్తున్నది. ఇదంతా ఈశ్వర లీల !

భాను: (హేళనగా) ఇదేనా నీ వింతకుముందు గొప్పగా ప్రసంగించిన అహింసా ధర్మం ? బలే వేదాంతి ! బలే వీరుడు !

విక్ర : లేదు. నేను తయారుగా లేని సమయంలో అకస్మాత్తుగా వచ్చి నామీద దండెత్తావు. అలాగే నీవు అనుకోని సమయంలో నేను వచ్చి నీమీద దాడి చేశాను. మృగబలం రాజ్యం చేసే విధానంలో ఇదే నియతి, నియమమున్నూ. దీని కంతు అంటూ లేదు. అహింసా

ధర్మములో దండయాత్ర చేసేవిధానమే వేరు. అది ప్రజలు స్వీకరించి ప్రయోగించినట్లయితే స్వర్గమే భూలోకంలోకి దిగివస్తుంది. ఆ కాలం ఎప్పటికి వస్తుందో! నీలాంటివారి పరువు ప్రతిష్ఠలు ఆ విధానంతో చూసే సమయం ఎప్పుడు వస్తుందో కదా!

[ఉత్తరువు చేసినట్లు సైగచేస్తాడు.]

మార్తా: (తలవాల్చి) ఈయనను ఏమి చేయమంటారు?

విక్ర : ఒక్క క్షణంక్రితం నాకాయన మరణదండన విధించాడు. నేను తిరిగి యీతనికి మరణదండన విధిస్తానని యీతని తల ఎదురు చూస్తూ వున్నది.

మార్తా: మన రాజ్యం దురాక్రమణ చేసిన రాజు శిరస్సు ఖండించటానికి నా ఖడ్గం తొందరపడుచున్నది మహారాజా!

విక్ర : మార్తాండా! కొంచెం ఆగు. ఈతని శిరస్సుకు దండన నేనే విధిస్తాను. (క్రింద పడిపోయిన కిరీటం ఎత్తి భానుగోపుడి తలమీద పెట్టాడు) ఇదే నేను విధించే శిక్ష! భానుగోప మహారాజా! తమరు సకలరాజ వీరలాంఛనములతో పోయిరావచ్చు. మీరు తిరిగి దండయాత్ర చేయడానికి వచ్చేలోపున మేము ఆయత్తమవుతాము. అయితే ప్రయోజనంలేని వృథా దండయాత్ర చేయడము హాత్యాకాండ! అది మాత్రం మీరు జ్ఞాపకం పెట్టుకోవలసి యుంటుంది. మార్తాండా! వీరికి రాజమర్యాదలు చేసి పంపించండి.

భాను: (అవమానంతో) విక్రమా! నేను ఓటమి పొందినట్లు అంగీకరిస్తున్నాను.

విక్ర : మహారాజా! నాకుకూడ ఇది ఓటమి అనవచ్చు. పశు బలం జయం సాధించినప్పుడు మానవునకు విజయ మెక్కడ? 'జయము —అపజయము' అనేవి లేని కాలం ఎప్పటికయినా వస్తుందా? ప్రేమ, అనురాగమూ ప్రపంచంలో నిలిపి ప్రతిష్ఠచేసే కాలం ఎప్పటికయినా వస్తుందా?

భాను: ప్రయత్నం చేద్దాం.

విక్ర : మానవుని విజయము స్థాపించే జగదీశ్వరుని కరుణా కటాక్షం కలకాలం ప్రసరించు గాక!

(చంద్రముఖి లజ్జావదనంతో విక్రముని కేసి చూస్తుంది. వెలుపల విజయభేరి ధ్వనిస్తూఉంటుంది]

[ తెర ]



# తీ య ని త లం పు

ర చ యి త

## తు రై వ న్

రేడియో కళలో చాలా కాలంగా కృషి చేస్తున్న విజ్ఞాని. తిరుచ్చి రేడియో కేంద్రంలో నాటక నిర్వాహకుడుగా ఇప్పుడు పనిచేస్తున్నాడు. చిన్నకథలు, నాటకాలు, కవిత- ఈ మూడు రకాల రచనలూ రేడియోలో ప్రసారం చేసి ప్రతి దినము ఒక ప్రత్యేక కల్పనతో క్రొత్త సొగసులు సృష్టి చేస్తున్న భావుకుడు. ఈయన పేరు: స. కంద సామి.

## పాత్రలు :

| | | |
|---|---|---|
| సెల్వనాయకమ్ | ... | నిర్మల |
| మాధవన్ | ... | |
| డాక్టరు | ... | |



# తీయని తలంపు

## మొదటి దృశ్యము

దూరంనుండి 'లెఫ్ట్, రైట్, లెఫ్ట్, రైట్, మార్చ్, హాల్ట్, రైట్, అటెన్షన్' అనే శబ్దాలు వినిపిస్తాయి.

నిర్మల : నాన్నా ! టీ రెడీ !

[దూరం నుండి ఒక ముసలాయన 'వెయిట్ వెయిట్' అని కేకలు వేస్తూ ఉంటాడు]

మాధవన్: అమ్మా !

నిర్మ : ఎవరు మీరు ?

మాధ: మిష్టర్ సెల్వనాయకమ్‌గారి ఇల్లు ఇదేనా ?

నిర్మ : అవును—మీరు ...

మాధ: ఆయనను చూచిపోదామని వచ్చాను. ఆయనగారి అబ్బాయీ నేనూ పదిహేను సంవత్సరాల క్రితం యుద్ధ సమయంలో ఒక మిలిటరీలో ఒక యూనిట్‌లో పనిచేశాం...

నిర్మ : ఆఁ—ఇప్పుడు తెలిసింది. మీరు...మీ పేరు మిష్టర్ మాధవన్ కాదూ ?

మాధ: అవును.

నిర్మ : అన్నయ్య యుద్ధరంగంనుండి వ్రాసే ఉత్తరాల్లో మిమ్మల్ని గురించి చాల చాల వ్రాసేవాడు.

మాధ: మీ యింటి గురించి నేనూ అతనూ మాటి మాటికీ చెప్పుకొంటూ ఉండేవాళ్ళము.

నిర్మ : కూర్చోండి. కొంచెం టీ తీసుకుంటారా?

మాధ: భేషుగ్గా... దాని కేం? ముఖ్యంగా మిమ్మల్ని గురించి చాల చాలా చెప్పేవాడు మనోహర్. నిర్మలగురించి చెప్పడంఅంటే వాడికి ప్రొద్దుపోయేదే తెలిసేదికాదు.

నిర్మ : (నవ్వుతుంది.)

మాధ: మనోహర్ - అంటే వాడూ వీడూ అంటున్నాను, క్షమించాలి! అలాగ మే మిద్దరమూ ఎంతో చనువుగా ఉండేవాళ్ళం. వాడు ఆ విధంగా పోకుండా ఉంటే...

నిర్మ : ఏమి చేసేది? మీరూ నేనూ అంతకంటె నోచుకో లేదు. మనోహర్ అన్నయ్యగురించి ఆ వార్త వచ్చిందిమొదలు నాన్నగారు ఇలాగ అయిపోయారు.

[తోటలోనుండి 'లెఫ్ట్ రైట్' శబ్దం వస్తుంది.]

మాధ: పాపం! ఒకే ఒక కొడుకు. ఎంత ప్రేమతో పెంచి పెద్దచేసి చదివించా రాయన! ఇలా గవుతాడని కలగన్నారా?

నిర్మ : మనోహర్ అన్నయ్యమీద ఆయనకు ప్రాణమే! యుద్ధంలో అన్నయ్య చేసిన సాహస కృత్యాలు విని ఎంత గొప్ప! ఎంత గౌరవం! అంటూ ఉంటారు.

మాధ: ఒక్కొక్క తండ్రి హృదయం అలాగ ఉంటుంది. అందులోనూ మీ తండ్రిగారిని గురించి మనోహర్

ఎన్నెన్నో చెప్పేవాడు. వాడికూడ భోజనం చెయ్యాలి; కాఫీ త్రాగాలి. మూడు గంటలు కొట్టితే చాలు; మనోహర్ రానీ, టీ తీసుకోవచ్చు అనేవారట.

నిర్మ : నిజమే. అదిగో నాన్నగారు తోటలోంచి వస్తున్నారు. ఆయనతో కొంచెం జాగ్రత్తగా మాటలాడాలి సుమండీ!

సెల్వనాయకమ్: నిర్మలా! నేను తయారు. టీ రెడీ అయిందా? ఓ! ఇదెవ్వరు– వీ రెవరో వచ్చినట్టున్నారు?

మాధ: నమస్కారమ్.

నిర్మ : ఈయనే నాన్నా – మిష్టర్ మాధవన్! మీకు జ్ఞాపకముందా?

సెల్వ : మాధవన్—ఏ మాధవన్? ఆఁ... మనోహర స్నేహితుడు. ఓ... [జ్ఞాపకం వచ్చినట్టు] మిష్టర్ మాధవన్! రండి, రండి. చాల సంతోషం. చాల సంతోషం. రండి. ఆ, కూర్చోండి మిస్టర్ మాధవన్!

మాధ: కూర్చుండే ఉన్నాను. మీరు కూర్చోండి మిష్టర్ సెల్వనాయకమ్.

నిర్మ : టీ త్రాగండి; చల్లారిపోతుంది.

సెల్వ: ఉ(మ్). టీ. నిర్మలచేసిన టీ త్రాగి చూడండి మిష్టర్ మాధవన్.

మాధ: చాల బాగుంది.

సెల్వ: అదేమిటి అంత సూక్ష్మంగా రెండు మాటల్లో చెప్పివేశారే! మనోహర్ మంచి రసికుడు. టీ యిచ్చిన

కప్పులో ఊది చెప్పుతూ ఉన్నట్టు మెల్లగా చెప్పే వాడు టీలో ఏమి లోపమో!

మాధ: తెలుసు... టీ రుచిచూచేనేర్పులో కొందరు రసికులు తమర్ని తాము మరచిపోతారు.

సెల్వ: ఒకనాడు మనోహర్ ఒక కప్పు టీ తీసుకొని పాట పాడటం మొదలుపెట్టాడు. అది చూడండి. అలాంటి పాట ఇంతవరకు నే నెక్కడా విననేలేదు. ఇంక ముందు వినబోయేదికూడ లేదు. హా... హు(మ్).

నిర్మ: అన్నయ్య కంఠం ఎంతో చక్కని కంఠం!

మాధ: మీ కంఠంమాత్రం-తంబురా శ్రుతిమాదిరి ...

సెల్వ: దీని కంఠం ఏమి కంఠంలెండి. మనోహర్ ఉండేవాడు-వాడిదీ కంఠం. శారీరమంటే అదీ శారీరమ్. దేవ శారీరమ్. అలాగే తేనె జారినట్టే సుఖంగా ఉండేది.

మాధ: మనోహర్ పాట నేను విన్నాను. ఎంత తీవ్రమైన యుద్ధ మధ్యంలో ఉన్నాసరే -వాడిని మేము ఊరికే విడిచిపెట్టేవాళ్ళం కాము; ఏదో ఒకటి పాడు అని వేధించేవాళ్ళము.

నిర్మ: నాకు పాట రాదు—అందుకని అన్నయ్యకు ఎంతో కోపం నామీద.

సెల్వ: మనోహర్‌కి కోపంవస్తే ఎలాగ వచ్చేదో తెలుసా? అయ్యయ్యో! టీ కప్, సాసర్, ఇవన్నీ విసరి కొట్టి ఒకే ఒక కుప్పగా పోసేవాడు.

[టీ కప్పులు పగిలిపోయిన చప్పుడు.]

నిర్మ : నాన్నా !

సెల్వ: అయామ్ సారీ ! నిర్మలా ! టీ కప్పు, సాసర్ అన్నీ పగులకొట్టివేశాను. సో—సారీ... మనోహర్ కోపం ఎలాగ ఉంటుందో అని చిత్రంలో చూపినట్టు చూపించాలనే ప్రయత్నంలో ఆ జ్ఞాపకం వచ్చి... అలాగ...

నిర్మ : చాలు చాలు ! నాన్నా ! సరే కానీ; తోటలో ఇంకా చెయ్యవలసిన పని ఇంకెప్పుడు పూర్తి చేయబోతున్నారు.

సెల్వ: పెద్దతోట! విన్నారా మిస్టర్ మాధవన్. మీ స్నేహితుడు మనోహర్ ఉన్నాడే; వాడు పదిహేనుమంది సైనికులు వస్తే పడపడమని కాల్చి చుట్టి త్రిప్పివేశాడు. వీ డొక్కడయినప్పటికీ వాళ్ళని అలాగే పచ్చడి చేశాడు-పచ్చడి ! కెప్టనుకి వీడి వీర సాహస కృత్యాలు విని ఒకే ఆశ్చర్యం ! అలాగే ఆవృత్తాంతమంతా వివరంగా వ్రాసి సీమకు పంపించేశాడు.

మాధ: మనోహర్ పేరు పెద్ద పెద్ద యుద్ధ వార్తలలో చేర్చిన సంగతి నాకు తెలుసు. నేను విన్నాను.

సెల్వ: పూర్తి వివరాలు మీకు తెలియవలసిన అవసరం లేదు. అవన్నీ నాకు తెలుసు. అవును—ఆ వివరాలు, ఆ పూర్తి వివరాలు...

మాధ: నిజం, నిజం !

నిర్మ : నాన్నా ! మీరీ తోటపని పూర్తి చేసివస్తే బాగుంటుంది.

సెల్వ: పెద్ద తోటని చెప్తావేమిటి? (ఏమంటారు?) వినండి మిష్టర్ మాధవన్! మనోహర్‌కి చాల గొప్పధైర్యం. పిరికితనం, భయం, వెనుబాటు–ఇటువంటి విషయాలు వాడిదగ్గర చెప్పకూడదు. వాడొక ఆదర్శ యుద్ధ వీరుడు. అర్జునుడు, భీముడు, అభిమన్యుడు–అటువంటి వీరులకోసమే మన పురాణాలూ ఇతిహాసాలూ రచించి నట్లు, మన మనోహర్ ఒక వీరాధివీరుడు; శూరాతి శూరుడు. హిహిహి ... మీరు మనోహర్ యుద్ధం చేయడం ప్రత్యక్షంగా చూశారా ? మీ వద్ద యీ కబుర్లన్నీ చెప్తున్నాను. చూడండి–ఎంత తెలివి తక్కువతనమో! చూడండి–ఎంత తెలివి తక్కువతనమో !

[తల కొట్టుకుంటూ ఏదో పాడుకుంటూ తోటవైపు వెళ్ళిపోతాడు]

నిర్మల: ఇదీ వరుస! మా కుటుంబం యిలా అయిపోయింది మిష్టర్ మాధవన్....

మాధ: విచారించకండి నిర్మలగారూ! ముసలాయన కొడుకు పోయిన విచారంతో బెంగపెట్టుకొని ఇటువంటి భ్రమలుపడి పరితపించి పోతున్నాడు.

నిర్మ: ఎల్లప్పుడు మనోహర్ గురించి జ్ఞాపకమే! ఆ జ్ఞాపకమే వలయ వలయాలుగా వచ్చి ఆయనను చుట్టివేస్తుంది. ఆ జ్ఞాపకాలనే వలలనుండి ఆయన ఇంక యీ జన్మకు తప్పించుకొని రాడేమో అనిపిస్తుంది.

మాధ: ఎందుకు తప్పించుకొని రాలేడు ?

నిర్మ: తప్పించుకోగలడా? ఆ దుఃఖం ఇంతలో శాంతి స్తుందా?

మాధ: ఆయనకున్న భ్రమ దుఃఖం కాదు నిర్మలా!

నిర్మ: దుఃఖం కాక?

మాధ: ఏ ఆధారమూలేని గొప్పతనం. తన కుమారుని గూర్చిన గొప్పతనం! కొడుకు చనిపోయాడే అని ఒక్కమాటయినా అంటారా ఆయన?

నిర్మల: లేదు. కాని కొడుకుమీద దుఃఖమూ బెంగా అలాగే కదు చేయిస్తుంది! హృదయ శోకంలో మునిగి పోయినవాళ్ళు నవ్వుకోవడం లేదా?

మాధ: అయితే ఈయన అలాగ కాదు. ఒకవేళ మనోహర్ యుద్ధంలో మరణించకుండా, ఏదో జబ్బుపడి వేరే కారణంచేత మరణించి నప్పటికీ కూడ ఈయన ఇంతగా బెంగపడిపోడేమో అనుకొంటాను.

నిర్మ: అదేమిటి? అంత నిశ్చయంగా చెప్తున్నారు?

మాధ: నన్ను మరచిపోకండి; నేను మనోహర్‌ని బాగా ఎరుగుదును. పటాలంలో చేరడానికి ముందు నాకు చెప్పే వాడు.

నిర్మల: ఏమని చెప్పేవాడండీ?

మాధ: ముసలాయన వాడిని తిట్టనిరోజు అంటూ ఉండేది కాదట. పిరికివెధవ, చవటపీనుగు, చదువురాని మొద్దు, దమ్మిడీకి కొరగాని దద్దమ్మ– అలాగ ఎన్నెన్నో అనే వారట మీ నాన్నగారు. నిజమా. కాదా?

నిర్మల: అవును. పిల్లవాడు మంచిపేరు తెచ్చుకోవాలని ఏ తండ్రికి మాత్రముండదు ?

మాధ: బాగాచెప్పారు. కొడుకు గురించి గొప్పగా చెప్పుకో వలసిందే. అదొకటే కదా వారి జీవనలక్ష్యం. ఆ గొప్ప, వాడు జీవించినపుడు లేదు, మరణంవల్ల వచ్చింది. అది తట్టుకోలేక ఆ ముసలాయన చిత్తం భ్రమించిపోయింది.

నిర్మ: ఏమో—ఆ పరిశోధనమంతా నాకేదో క్రొత్తగాఉంది.

మాధ: కొత్తయేకాదు. అర్థంకూడ కాదు.

నిర్మ: ఎవరన్నారు అలాగని?

మాధ: మీ నాన్నగారి భ్రమ పోగట్టడానికి ఒకే ఒక ఉపాయము ఉంది.

నిర్మ: అదేమిటో చెప్పండి మిస్టర్ మాధవన్. ఆ భగవంతుడే మిమ్మల్ని ఇందుకోసం ఇక్కడికి పంపినాడేమో అనిపిస్తుంది. నాన్నగారికి కొంచెం గుణమిస్తే నాకు విమోచనం కలుగుతుంది. ఏమిటా ఉపాయం చెప్పండి!

మాధ: పూర్తి నిజం— అసలు ఏమి జరిగిందో ఉన్నదున్నట్లు ఆయనకి చెప్పివెయ్యాలి.

నిర్మల: పూర్తి నిజమా? ఎవరిని గురించి ?

మాధ: మనోహర్ గురించి.

నిర్మ: అన్నయ్య గురించి అంతా ముందే తెలిసింది. ఇంకే ముంది ?

మాధ: (నవ్వుతూ) నమస్కారం. వస్తాను నిర్మలా! మిగిలిన విషయాలు మాయింటివద్దకు వస్తే రేపు ఉదయం మాటలాడు కొందాం.

నిర్మ : [చటుక్కునలేచి] మిస్టర్ మాధవన్!

మాధ: [దూరంగా] రేపు ఉదయం మాటలాడు కొందాం లెండి.

## రెండవదృశ్యము

సెల్వ: నిర్మలా! మనోహర్ పటానికి ఈ మల్లెపూల దండ ఎంత అందంగా ఉందో చూశావా?

నిర్మ: అవును నాన్నా!

సెల్వ: ఈ మల్లెపూలదండ మనోహర్ ప్రదర్శించిన మహా వీరపరాక్రమానికి, వాడి తండ్రి ఝుచ్చిన బహుమానం!

నిర్మ: నాన్నా! మీరు తోటలో పని చేసిచేసి చాలా అలసిపోయి నట్లున్నారు....

సెల్వ: నో నో! నేనెంత ఆనందంగా ఉన్నానో తెలుసా! నా జీవితం ప్రతిసంవత్సరమూ మనోహర్ కోసమే. అదే ఆనందం, అదే సంతోషం, అదేస్వర్గం, అదే... ఏం? నిర్మలా-అలాగ చూస్తున్నావు?

నిర్మ : ఏమీలేదు నాన్నా! నీ సంతోషం ఎప్పుడూ ఇలాగే ఉండాలని భగవంతుని ప్రార్థిస్తూ ఉంటాను.

సెల్వ: సరేలే! ఒక కొడుకుకు తండ్రి చేయవలసిన ఉపచారములు-సౌకర్యములు-ఇవన్నీ చేస్తూ ఎప్పుడూ... హి హి హీ...

నిర్మ: అదిగో! డాక్టరు వచ్చారు.
డాక్టరు: గుడ్ మార్నింగ్ మిస్టర్ సెల్వనాయకమ్
సెల్వ: గుడ్ మార్నింగ్.
నిర్మ: నమస్కారమ్ డాక్టర్.
డాక్ట: [మెల్లిగా] మందు ఏదైనా తీసుకున్నారా?
నిర్మ: లేదు, డాక్టర్.
సెల్వ: డాక్టర్, మీ మందు వేసిన తర్వాత నా మల్లి మొక్కలు ఎంత చక్కగా పూవులు పూస్తున్నాయో తెలుసా!
డాక్ట: అలాగా!
నిర్మ: మందు మీకని తెలియదా? ఇదేమి వేళాకోళం?
సెల్వ: నా కెందుకమ్మా మందు? నాకేమైనా వ్యాధియా? రోగమా? చక్కగా భోజనం చేస్తాను. తోటపని చూచుకొంటూను సంతోషంగా ఉంటున్నాను. ఆడుకొంటాను, పాడుకొంటాను...
నిర్మ: డాక్టర్....
డాక్ట: మీ రెందుకు కంగారు పడతారు నిర్మల! ఇంత సంతోషం ఉన్నవారికి ఒక్క వ్యాధియైన ఉండటం ఎక్కడయినా విన్నారా?
నిర్మ: ఈయన్ని యింకా యిలాగ వదలి వేయడమే మంచి దని పిస్తుంది. ఆయన చెప్పున్నది నిజమే. అయనకు ఎందుకూ మందు?
డాక్ట: [నవ్వుతూ] ఆయనతో కూడితిరిగి అలవాటయిపోయి

మీకుకూడ భ్రమపట్టు కున్నదేమో అని నాకు భయంగా ఉంది.

సెల్వ: డాక్టర్! ఈమె మా అమ్మాయి. అవునా కాదా?

డాక్ట: అవును, మీ అమ్మాయే. దానికేం?

సెల్వ: నేను సంతోషంగా ఉండాలనే కదా ఈమె ఉద్దేశం?

డాక్ట: నాకు కూడా అదే ఉద్దేశం?

సెల్వ: నాకోసం మందు గిందు అని వృధాగా డబ్బు ఖర్చు పెట్టడం ఎందుకు చెప్పండి?

డాక్ట: ఎందుకా ? మీ మల్లెమొక్కలు చక్కగా పెరిగి పూలు పూయాలా వద్దా?

సెల్వ: యెస్ యెస్. మందే వద్దంటున్నాను అనుకొంటు న్నారా? నిర్మలా! యు ఆర్ రైట్. ఇంక ఎన్ని సీసాలు మందులు కావాలో తెచ్చియియ్యి. చాల సంతోషం. సంతోషం డాక్టర్–సంతోషం.

[వెళ్ళిపోతాడు]

డాక్ట: అయ్యో! పాపం!

నిర్మ: ఇది గుణమిస్తుందటారా డాక్టర్!

డాక్ట: సరిగా మాటలాడితే చక్కగా గుణమిచ్చి తీరుతుంది.

నిర్మ: డాక్టర్!

డాక్ట: ఏమిటి సంగతి?

నిర్మ: నేను బ్యాంక్ వరకు పోయిరావలసివుంది. ఇంట్లో ఎవ్వరూలేరు. నేను తిరిగి వచ్చేవరకు ఈయనను కని పెట్టి చూస్తూ ఈయనతో మాటలాడుతూ ఉండండి.

డాక్ట: సరే! త్వరగా రావాలి. మందు వైద్యానికి లొంగని వ్యాధి మనోవైద్యానికి లొంగుతుందేమో చూస్తాను.

# మహా డవ దృశ్య ము

మాధ: మనోహర్ మరణం ఇటువంటి దారుణస్థితిలో సంభ వించింది. ఇదంతా తెలుస్తే మీ నాన్నగారి వ్యాధి అంతా పోతుంది.

నిర్మ: తన కుమారుడు వీరపరాక్రమంచేత మరణించాడనే భావనలో ఆయన ఉన్నాడు.

మాధ: బర్మా అడవులలో ఆ కొండజాతి పిల్లను అడిగితే అంతా తెలుస్తుంది.

నిర్మ: [విచారిస్తూ] ఆ హంతకులు మోసంచేసి పట్టుకొనే శక్తికి పేరుపడ్డవాళ్లు.

మాధ: నాల్గుసారులు వాళ్ళు హెచ్చరిక చేశారు. నేను కూడ చెప్పి చూశాను. మనోహర్ వినలేదు. పోయి, చూచి రమ్మన్నాను. మరి తిరిగిరాలేదు. ఎలాగో యుద్ధంలో మరణించిన యుద్ధవీరులతోపాటు వాడి పేరు చేరిపోయింది.

నిర్మ: ఇది వింటే నాన్నగారు నిర్మించుకున్న గొప్పతనము, కలలమేడ కూలి నూరుముక్కలై పోతుంది.

మాధ: అయితేనేం ? ఈ మనోవ్యాధినుండి విముక్తి కలుగు తుంది.

నిర్మ: అది విముక్తియని మీరంటారా ?

మాధ: భ్రమపోవడం విముక్తి కాదా ?

నిర్మ: ఆనందంలోనుండి తిరిగి దుఃఖంలోకి మారిపోవడం విముక్తి అనిపించుకోదు మిస్టర్ మాధవన్.

మాధ: లేదు. అసత్యమునుండి సత్యము ప్రకాశించడమే

విముక్తి అంటాను. అటువంటి విముక్తి కలిగితే మీకు కూడ విముక్తి కలుగుతుంది. మీ విముక్తితో నా జీవితం చిగుర్చి ఆనందంతో అలరుస్తుంది.

నిర్మ: మీరనే దేమిటో నాకు తెలియడంలేదు, మాధవన్!

మాధ: నిర్మలా! నిన్ను గురించి మనోహర్ ఎన్నెన్నో చెప్పేవాడు. వాడు కనుక ఇప్పుడు జీవించివుంటే నీవూ నేనూ యీ పిచ్చిపట్టిన ముసలివాడిని గురించి ఇంతగా ఆలోచిస్తూ కూర్చునే వాళ్ళం కాము.

నిర్మ: నా జీవితం సవ్యంగా లేదు మాధవన్. దయచేసి మీ యభిలాష మరచిపోండి.

మాధ: జీవితమంతా ఈ ముసలివాడిని కనిపెట్టి చూస్తూ బ్రతుకు వృధాచేసుకొంటావా నిర్మలా?

నిర్మ: నా విధి, కర్తవ్యం అది! ఆయన నన్ను కన్నతండ్రి, ఆయనకోసం ఈ మాత్రం కూడ చేయలేక పోయా నంటే...

మాధ: అర్థంలేని మాట. నేనంటే నీకు నచ్చలేదా? నిర్మలా – నచ్చకపోతే చెప్పివేసెయ్యి!

నిర్మ: నచ్చారు.

మాధ: మరి?

నిర్మ: నాన్నగారి జీవితం దుఃఖమయమై దానిలోనుండి మనం ఆనందం తెచ్చుకోవాలా?

మాధ: ఆయనకు గుణమివ్వకపోతే, నావైపు ముఖమెత్తికూడ చూడవా?

నిర్మ: ఎలాగ చూడగలను? అలా జీవించగోరితే, ఆయనకు

మనస్ఫూర్తిగా శుశ్రూష చేయడానికి వీలవుతుందా?

మాధ: చేయలేవు. అందుకే నే చెప్పేది. ఆ ముసలాయనకు మనోహర్ ఎలాగ మరణించాడో ఆ మోసమంతా చెప్పేసి ఆయనకు చిత్తం స్వాధీనమయ్యేటట్లు చేద్దాం.

నిర్మ: మిష్టర్ మాధవన్...

మాధ: ఏమంటావు నిర్మలా!

నిర్మ: దయచేసి నా జీవితంలో సుడిగాలి రేపకండి. నాన్న గార్ని ఇలాగే ఉండనీయండి. మనోహర్ అన్నయ్య ఎలాగో చనిపోయాడు. ఇంక అతనినిగురించి అబద్ధమో సబద్ధమో చెప్పనక్కరలేదు. దయచేసి మీరీ వూరు విడిచి వెళ్ళిపొండి.

మాధ: (నవ్వుతూ) ఊరు విడిచిపెట్టి పోనా? సత్యం తెలియ జెప్పకుండానా?

నిర్మ: మీ సత్యమూ మీరున్నూ పోండి! మీ మనస్సులోది చెప్పివేయడానికి మీ సుఖం అంత ముఖ్యమను కొంటున్నారా?

మాధ: నా సుఖంతోపాటు నీ సుఖంకూడ చేర్చి...

నిర్మ: నాసుఖం ఎవరూ చూడనక్కరలేదు. నామంచి నాకు తెలుసు.

మాధ: ఇదే తెగతెంపులా? అయితే ఇంక ఇంతేనా?

నిర్మ: వేరే మార్గంలేదు మిష్టర్ మాధవన్! దయచేసి మీరే ఉపాయం చెప్పండి. నాన్నగారి సంతోషం నా సంతోషం. అది కూలగొట్టే సత్యం ఏదీ నాకు అక్కరలేదు.

మాధ: నీవు చెప్పేది నేను అంగీకరించలేను. నీవు నాకు కావాలి. నీకు నా సహాయం కావాలి. నీ తొందరలో నీ మనస్సును మరచిపోకు!

నిర్మ : మాధవన్...

మాధ: నేను మీ నాన్నగారితో అంతా చెప్పివేస్తాను. మనోహర్ యెడల నేను చేయవలసిన కర్తవ్యం అదే, తరువాత ఏమి జరిగితే అది జరుగనీ...

## నాలుగవ దృశ్యము

తోటలో ముసలాయిన లెఫ్ట్ రైట్ అంటూ తిరుగుతూ ఉంటాడు.

నిర్మ : నాన్నా ! నాన్నా ! టీ రెడీ !

[ముసలాయన వెయిట్ వెయిట్ అని కేకలు వేస్తూ ఉంటాడు.]

మాధ: మంచి సమయం చూచి చెప్పివేద్దామని వచ్చాను.

నిర్మ : నమస్కారం మిష్టర్ మాధవన్ ! టీ తీసుకోండి.

మాధ: నా జీవితమంతా నీ చేతిలో ఇలాంటి టీ అందుకనే భాగ్యం నాకు దొరికితే, ఎంతో బాగుండును.

నిర్మ : అందుకోసమే ముసలాయనకు ఇప్పుడు టీ ఇస్తున్నాను.

మాధ: నీవిలాగ పనిమనిషిలాగ పనులు చేస్తూవుంటే ఆ ముసలాయన ఏమి పట్టించుకోంటాడు ?

నిర్మ : టీ తీసుకోండి.

మాధ: నీవు రాత్రి ఆలోచించి ఏదో చక్కని నిశ్చయానికి వచ్చావని నాకు తెలుసు నిర్మలా!

నిర్మ : అవును. చక్కని నిర యానికే వచ్చాను.

మాధ: సంతోషం. చాలబాగుంది. ముసలాయనను పిలిచి మనమిద్దరమూ కలిసి చెప్పవచ్చును. మనోహర్ గురించిన యథార్థం చెప్పివేద్దాం!

నిర్మ : ఇప్పుడు దానికి వచ్చిన తొందర ఏముంది? ఇంకొక కప్పు టీ కావాలా?

మాధ: వద్దు.

నిర్మ : నిన్న నన్ను ఒకసంగతి అడిగారు కదా—నా విషయం.

మాధ: అవును.

నిర్మ : నిజం చెప్పండి; నేనంటే మీకూ ఇష్టమేనా?

మాధ: (నవ్వుతూ) అయ్యో నిర్మలా! నీవు లేకపోతే నా జీవితం ఎండిన బీడువంటిది. అడవిని కాచిన వెన్నెల.

నిర్మ : మీరు బాగా ఆలోచించుకున్నారా?

మాధ: ఆలోచించుకోవడానికి ఏముంది?

నిర్మ : నాన్నగారితో విషయం చెప్పివేయడమేనా?

మాధ: అవును. కొడుకు ఒక సాధారణ కారణంవల్ల చచ్చిపోయాడు అని తెలుస్తే అతని గొప్పతనం అంతా పోతుంది. భ్రమ సమసిపోతుంది. పోనీ, కుమార్తె అయినా సంతోషంగా ఉండాలీ అని మనల్ని విడిచిపెట్టివేస్తాడు.

నిర్మ : కుమార్తెయా? ఏ కుమార్తె?

మాధ: నా నిర్మల! నీవే!

నిర్మ : నేనా? మిస్టర్ మాధవన్! పూర్తినిజం తెలుస్తే భయపడకుండా ఉంటారా మీరు?

మాధ: పూర్తి నిజమ్మా?

నిర్మ : అవును.

మాధ: చెప్పు నిర్మలా !

నిర్మ : నేను నిర్మలను కాను. ఈ యింటి పనిమనిషిని.

మాధ: ఈ యింటి... ...

నిర్మ : పని మనిషిని.

మాధ: నిర్మలా ! నిర్మలా ! నా నిర్మల యేమయింది ?

నిర్మ : మనోహర్, అతని తండ్రికి పట్టినగతే ఆమెకు కూడా పట్టింది.

మాధ: ఆఁ. ...

నిర్మ : ఆమె చనిపోయినప్పుడు నేనుకూడా ఉన్నాను. ఆమె తన తండ్రికి నేను కుమార్తెనై ఉపచారం చెయ్యాలని ఆమె కడసారి ప్రార్థించింది నన్ను.

మాధ: నీవెలాగ సమ్మతించావు ?

నిర్మ : నిర్మల అనురాగమే నా ప్రాణం! జీవితంమీద ఆశ వదలుకొని దీనికి సమర్పితం అయిపోయాను. ముసలాయనకూడ నన్ను నిర్మల అనుకొనే భావించి మాటలాడుతూ వచ్చాడు. ఆయన భ్రమలో మరొక ఘట్టం అది.

మాధ: ఆయన భ్రమ తెలుస్తే, ఈ కుమార్తెకూడ పోతుందన్నమాట.

నిర్మ : ఇదే పూర్తి నిజము. ముసలాయనకు మీరు కల్పించబోయే విముక్తి యిదే !

మాధ: నిర్మలా !

నిర్మ : నేను నిర్మలను కాను. పనిమనిషిని.

మాధ: కావు. నీవే నిర్మలవు. మనస్సు కలవరపాటు పొందిన యజమానికోసం జీవితం అర్పించ నిశ్చయం చేసుకొన్న మహా జ్ఞానివి. నీవే నిర్మలవు.

నిర్మ : మాధవన్ ! నామీాద మీా ప్రేమ నిజమేకదా ?

మాధ: ఎందుకు అడుగుతున్నావు నిర్మలా ?

నిర్మ : ఆ మంచిమాట ఒకటే నన్ను పరవశంలో ముంచెత్తుతుంది. ఆ తీయని తలంపు జ్ఞాపకం తెచ్చుకొని ఆ ముసలాయనలాగ సంతోషంతో నా జీవితాంతం వరకు కాలక్షేపం చేయగలను.

మాధ: మంచిది నిర్మలా ! నీవు నన్ను గొప్ప పాపకృత్యం నుండి కాపాడినందులకు ఇవే నా వందనాలు !

నిర్మ : మనోహర్ అన్నయ్య నిన్ను జ్ఞాపకం తెచ్చుకొని ఎంతో గొప్పగా చెప్పుకుని ఉంటాడు.

మాధ: అవును. నేను వెళ్ళిపోతున్నాను. నిర్మలా! నాసౌఖ్యం కోసం పడిన భ్రమ తీరిపోయింది.

నిర్మ : ఇంకొంచెంసేపు ఉండండి. ముసలాయన టీ త్రాగిన తర్వాత చెప్పవచ్చు. నాన్నా ! నాన్నా !

[దూరంనుండి లెఫ్ట్‌రైటు అంటూవున్న ముసలాయన ఇదిగో వస్తున్నాను నిర్మలాయని సంతోషంగా వచ్చివేస్తాడు.]

మాధ: ఆయనే జీవితంలోని ఆనందం పూర్ణంగా అనుభవిస్తున్నాడు.

ముస : నిర్మలా ! ఈవేళ మల్లెచెట్లులన్నీ చూస్తే ఎన్ని పూలు ! రెండు దండలు కట్టివేశాను. ఒకటి మనోహర్‌కి, మరొకటి మనోహర్ మరో ప్రాణమైన మాధవన్‌కిన్నీ! [ తెర ]

# చక్రబంధము

రచయిత

'సుఖి'

నవ్వు పుట్టించే హాస్య రచనలలో చిర కాలం అనుభవం కలిగిన హాస్య రచే యిత. చిన్నకథలూ నాటకాలూ హాస్యవ్యాసాలూ ఎన్నో రచించి గ్రంథాలుగా ప్రకటించిన వారు. రేడియోలో ఇరవై సంవత్సరాలనుంచి సేవ చేస్తూ ముందుకివచ్చినవారు. తిరుచ్చి రేడియోలో 12 సంవత్సరాలుగా పని చేస్తూ నాటకరచనలో తానుప్రత్యేకంగా ఒక బాణీ ప్రవేశపెట్టిన రచయిత. ఈయనపేరు యన్. సుబ్రహ్మణ్యం.

## పాత్రలు

| | | |
|---|---|---|
| వినాయకమ్ | — | జ్ఞానమ్ |
| మణ్యం | — | మీనాక్షి |
| పరమశివన్ | — | బిచ్చగత్తె |
| సింగారం | — | |

# చక్రబంధము

## మొదటి దృశ్యము

వినాయకం : అరే సింగారం! నీకున్న తెలివితేటలకి నీవు చాల ముందుకి రావచ్చు.

సింగారం: పో మామా! తెలివితేటలూ గిలివితేటలూ ఎవరి కున్నాయిలే గాని; డబ్బు సంపాదించే ఉపాయం చెప్పు చాలు!

వినా : అయితే చెప్తాను విను. మీ మేనత్తకూతురు మీనాక్షి ఉందికదా! ఆమెను కనక నీవు చేబట్టితే...

సింగా: ఆమె యేదో గొప్ప సంబంధం అనుకొంటు న్నావా? మనకి అది గొప్ప సంబంధం ఏమీకాదు. సర్వసాధారణము. దానివల్ల ప్రయోజనం లేదురా వినాయకం!

వినా : అరే! నీకున్న కల్పనకూ, వాక్చాతుర్యానికీ సమయో చిత బుద్ధికీ సినీమాలో అయితే బాగా రాణిస్తావు.

సింగా: అదేమిట్రా! నేను బాగా ఉండాలని నీకు లేదా యేమిటి?

[మీనాక్షి అక్కడికి వస్తుంది.]

మీనాక్షి. బావా! బావా! బావా! (చూడకుండా పిలు స్తుంది)

సింగా: ఎందుకు మీనాక్షీ అంత తొందర? చేతిలో ఏమిటి తెచ్చావు?

మీనా: నీ పేరు వెండితెఱ మీదకి ఎక్కబోతున్నది. నాన్న గారితో చెప్పి నిశ్చయంచేసి వచ్చాను.

వినా: చూశావురా ఆలోచన సింగారం! మనస్సులో అలాగ తలచుకొనేటప్పటికి సర్వాంగ భూషణాలతో నిన్ను వెదుకుకొంటూ వచ్చింది సినీమా ఛాన్సు. ఏమిటి చెప్పు మీనాక్షీ!

మీనా: ఏమీ లేదు బావా! నీకున్న కల్పనాచాతుర్యానికీ తెలివి తేటలకీ నీవు సినీమాలోకి ప్రవేశిస్తే బాగా రాణిస్తావని నాన్నగారికి చెప్పి నచ్చజెప్పాను.

సింగా: అయ్యో! నాకు సినీమా సంగతి ఏం తెలుసు? నన్ను వేళాకోళంచేసి వేడుకగా వినోదిస్తున్నావా మీనాక్షీ!

వినా: కళా ప్రపంచంలో ప్రవేశించడానికి అందరికీ హక్కు ఉన్నది. అది అందరి స్వంతము. నీవందులో విజయం సాధిస్తావురా సింగారం. సందర్భం దానంత అదే ఒక గారడీవాని మామిడిచెట్టులాగ పైకి వచ్చింది చూశావా?

మీనా: ఇదిగో చూడు బావా ఆర్డర్- నీవు అక్కడ పని చేయడానికి ఉత్తరువు!

సింగా: ఉద్యోగానికి అప్పుడే ఆర్డరుకూడ వచ్చేసిందా? వేళా కోళం కాదన్నమాట. అయ్యో! నాకీపనులు అల వాటు లేదు మీనాక్షీ!

వినా : అరే సింగారం—ఇదంతా మీనాక్షీ దయ, మీనాక్షి దయ అని మనస్సులో వ్రాసుకొని జపం చేయడం ప్రారంభించు. విజయం నీకు తప్పకుండా లభించి తీరుతుంది.

సింగా: ఏమిటి చెయ్యడం ?

వినా : అదేమిట్రా? కొంచెంసేపటికి ముందే నేనీమాట చెప్పే టప్పటికి వచ్చివేశావు. నువ్వన్నట్లే, అనుకొన్నది అవలీలగా అయిపోయింది. నా తలంపు ఎంత సత్యమో చూశావా! అదే కారణం ! మీనాక్షి చెప్పిందికూడ నవ్వుతాలనుకొని సిగ్గుపడుతున్నా వేమిటి-ఎఱ్ఱతామర పూవులాగ.

మీనా: బావా ! బావా !

సింగా: మీనాక్షీ ! ఇదిగో బయలుదేరుతున్నాను. విజయం సాధిస్తాను. వెండి తెఱమీద నాకీర్తి చంద్రికలు దశదిశలా వ్యాపించేవరకు పాడి,ఆడి, నటించి, వీరసాహస కృత్యాలు చేసి...

మీనా: చాలు చాలు! బావా! ఈయొక్క సందర్భంబాలు నీవు కల్పనా చక్రవర్తివని చెప్పడానికి. విజయమాల వేసి వీరపూజచేసి పంపిస్తాము. రా ! స్వాగతము ! సుస్వాగతము !

వినా : శభాష్...శభాష్...మన మందరమూ ప్రశంశావచనములు చదివే వందిమాగధులములాగ ఉన్నాము. (నవ్వు)

## రెండవ దృశ్యము

బిచ్చగత్తె: అయ్యా! ఆకలి; కడుపు మండిపోతోంది, ధర్మం చేయండి.

సింగా: ధర్మం చెయ్యండి అని అనడానికి నీకు సిగ్గులేదా? దయతో ధర్మం చెయ్యండి అని చెయ్యి చాపడం మంచిదా, ఇష్టంవచ్చిన పనిపాట్లు చేసి హాయిగా జీవించడం మంచిదా? ఆలోచించి చూడు...... కంఠం సవరించి కఠోరముగా కడుపు కక్కుర్తికోసం కళవళ పడుతూ కరములు సాచి కనికరముతో కణ కణమండే కడుపుతో కరుణా కటాక్ష వీక్షణ భిక్ష కోరుట కడుంగడు శోచనీయము.

బిచ్చ. అయ్యా! బిచ్చం వెయ్యండి. ఆకలి. ఒక్క కానీ యివ్వండి చాలు.

[పిల్లవాడు ఏడుస్తాడు]

సింగా: ఊరికే ఊరంతా ఊహ లేకుండా ఊరేగివచ్చి ఉత్తగా ఓహో యని కేకలు వేయడం ఒక బ్రతుకా? భిక్షుకీ! రక్షకుని కుక్షికోసము ఆదరములేని ఈ ధనికస్వాముల దారుణ భూమిలో, మాటనేర్చి, పాటనేర్చి, ఆకటి కేకలు వేస్తే కాకులయిన లోకులకు వ్యాకులము కలుగుతుందా? ఇష్టప్రకారము కష్టపడి నష్టము లేకుండా ఫస్టుగా పనిచెయ్.

బిచ్చ: నేను బిచ్చకత్తెను బాబూ! నేను అడిగేది మీకు చెవిని బడిందా? ఏమిటేమిటో అంటున్నారు. స్వామీ— ఒక్క కానీ ధర్మం చేయడానికి— ఒకకానీ లేదా?

సింగా: కానీ యిమ్మని అడగడానికి నీ మనస్సు ఎలాగ వచ్చింది ? నీ ఆకలి కేకలు ఉగ్రమహోగ్రమైన కీలలుగా నా హృదయంలో ప్రళయ జ్వాలలు రేపాయి. నీ ఆకలి పీడితలోకపు ఆకలి. సిగ్గు బిడియము అనేవాటిని చంపివేసింది. మానవత, మాన మర్యాదలూ మటుమాయం చేసింది. నగ్నంగా భగ్న మనోరథుల భగ్నకీలలకు ఉద్విగ్న వేదనతో నగ్న తాండవం చేస్తున్నది.

బిచ్చ : స్వామీ ! నేను బిచ్చం అడుగుతున్నాను. అది వేస్తారా, వెయ్యరా ?

సింగా: నీ హక్కులను నొక్కి అడగడం తెలియలేదా ? అయ్యో దైవమా ! మానవులలో మానవత్వమే మాయమయిందా ? మరిచిపోయిందా మానవ హృదయము ! ఏమి లోకము ! ఏమి శోకము ! ఇది ప్రజల హక్కులు కాపాడే ప్రపంచమా ? ప్రజలను పీడించి, బాధించి వారి శ్రమతో కట్టిన మేడలలో కులుకుతూ ఉండే ధనికలోకమా ? హే ! భిక్షుకారిణీ !

బిచ్చ : అయ్యా ! నా కడుపు కాలుతోంది. ఆకలి. బిచ్చం వేసి పంపిస్తారా ?

సింగా: బిచ్చం మాత్రమేమిటి ? ఏ లోచ్చమూ లేని హెచ్చు ధనాలతో హంసతూలికా తల్పంమీద తూగుతూ, ఆనంద సౌధాలలో ఊరేగవలసిన నీవు నడివీధిలో నిలిచి దిక్కులేక మ్రొక్కులేక దీనంగా తిండికోసం విలపించవలసి వచ్చింది. దానికి కారణం ఏమిటో

తెలుసా ? నీకు బుద్ధిఉంది; అది ఉపయోగించని కారణంచేతనే !

బిచ్చ: స్వామీ ? కానీ యిస్తానంటారా ? లేదంటారా?

సింగా: కాని; కానీకోసం అర్థణాకోసం పగలనక రేయనక ప్రొద్దున్న సాయంకాలం ఎల్లప్పుడూ అడుగుతూ, పూరేకులు కోల్పోయిన పూమొగ్గలాగు, తేలి పోయే కాళ్ళతో వాలిపోయిన మాటలతో ఇచ్చాం వచ్చినవారిని బిచ్చమడిగి తుచ్ఛ జీవనం జీవించేకంటే ఉచ్ఛమార్గంలో అచ్ఛా యని పిలుచుకోనేటట్లు హెచ్చరికతో పై పెచ్చు... పై పెచ్చు...పై పెచ్చు....

[వినాయకమ్ ప్రవేశిస్తాడు]

వినా : మిస్టర్ సింగారం–ఏమిటీ లెక్చరు ఈ నడివీధిలో?

బిచ్చ : అయ్యో ! స్వామీ ఈయన ధర్మం చేస్తాననీ అనరు చెయ్యననీ చెప్పరు. మీరైనా వేయండి. ఒక కానీ స్వామీ!

వినా: పో పో ! గోలపెట్టక– వేరే యింకో యింటికి పోయి అడుగు.

సింగా: వేదనతో బాధపడే యీ పేదవారిని, సోదరజాతిని, వాదులాడి ఏ దూరానికో పో పొమ్మనకు. అటమట లాడే అనాథ అబల కంఠంలో ఆలాపించే ఆ వేదన స్వరాలు ఆపకు !

వినా: అయితే ఏదోవేసి పంపెయ్యి. నీవేదో వేదాంతం చెపితే ఆయమ్మి ఆకలి తీరుతుందా? రా పోదాం సింగారం !

సింగా: నిండులోకంలో తిండిలేక మాడి, బండమొండి శిబండిగా ఒక నాకిలలామ వచ్చి పసికందులతో మచ్చికతో ఇచ్చకముగా బిచ్చం అడుగుతూ ముచ్చ మటలు క్రక్కుతూఉంటే...

వినా: అరేయ్! నీవు అనుకున్నట్లు ఇది సినిమా సెట్టింగు కాదు. నడివీధి! ఇది నిజమైన బిచ్చకత్తె, వేషం వేసుకొన్న బిచ్చగత్తె కాదు.

సింగా: రా! వినాయకం. ఈమె నాకు మాటలునేర్పి; జీవిత నాటకమే వచన లోకముగా చక్కని సంభాషణలు వచ్చేటట్టు చేసింది, నాకు యీడైలాగ్సు సహజంగా వచ్చేటట్టు చేసింది. సరే నీవు వచ్చిన పనియేమిటో చెప్పు. స్వయంగా అడుగుచున్నాను. మా మేనత్త కూతురు మీనాక్షి సుఖయేకాదా! ఆమె నీ మూలముగా పంపిన రాయబార వృత్తాంతం యేమై యుండును?

వినా: అరే సింగారమ్! నీవనేదేమిటి—నాకు బోధపడటంలేదు?

సింగ: మనోహరమైన ఆతలోదరి సులోచనము లేమని నన్ను గూర్చి తలపోయుచున్నవి? పలుకుము. కలికిగూర్చి—ఆమెను గూర్చి సవనవోన్మిషిత సుమలతలూ నక్షత్ర సముదాయములూ ఏమనుచున్నవో తెలియునా?

వినా: అరే సింగారం... నేను వినాయకాన్ని. నేనేదో కవిసామ్రాట్టు ననుకొని గ్రాంథికభాషలో యతిప్రాసలతోను యమకచమకాలతోనూ డైలాగ్సుచెప్పి నన్ను చంపకు—దిగరా నాయనా!

సింగ: నా మనస్సును చూరగొన్న మనోహారిణి మాటలే మన్నది- మరల వచింపుము! మేనత్త కూతురనీ మా మీనాక్షీ తనంత మిరుమిట్లుగులే...

వినా: చాలు చాలు. ఒరేయ్ నేను చాల అవసరంగా ఊరికి పోవాలి.

సింగ: కాఫీ త్రాగి పోవచ్చును. కార్యాంతర మున్ననేమి? కాంతాశిరోరత్నమైన కన్యకామణి కంటికె చూపుల కాముని తూపుల కామాంధుని చేసిన కారణముచేత కథ చెప్పవలెను.

వినా: ఏడిసినట్టేవుంది, వెధవ డైలాగూ నీవున్నూ. సినీ మాకు పాటలు మాటలూ వ్రాయాలనే కోర్కెతో అదంతా మామూలు మాటలలో ప్రయోగిస్తాను అంటే ఎవరు వింటారు. పనికిరాని పాడు డైలాగు! ముందు అవి కట్టిపెట్టు.

సింగ: జీవితములో భావితరాలవారు సంభావితమై...

వినా: మీనాక్షి చెప్పింది నిజమే నన్నమాట! నీకు తెలుసునో లేదో కాని గుర్తుపెట్టుకో- మీనాక్షి తండ్రి నిన్ని సినీమాలో శిక్షకు పంపిన తర్వాత నీ ప్రేమ లేఖలూ నీ కరెస్పాండెన్సూ చదివి అర్థం చెప్పడానికి ఒక మనిషిని ఏర్పాటు చేశాడు.

సింగ: నా కల్యాణీ! అతిలోక కాంతామణీ! మన్ మనో ఆకాశ ప్రకాశజ్యోతీ! అన్నులమిన్నా! అత్త కూతురా...! మీనాక్షికి నేను సువర్ణాక్షరా లొలికించే సులేఖ ప్రేమలేఖలు అర్థం కాలేదా!

వినా: అది కాదురా నాయనా! అందులో తెలుగు బోధపడ టంలేదట. అందుచేత అందులో తెలుగు అర్థంచేసి తెలిసేటట్టు మళ్ళీ తేటమాటలతో చెప్పడానికి తెలుగు తెలిసిన ఒక గుమాస్తాను నియమించాడు మీనాక్షి తండ్రి.

సింగ: ఈ విధముగానే అయిన నగుగాక! విద్వత్ జన మనో రంజనమగు సుహృల్లేఖ వినాయకా! వృథాకాదు. నా భాష ఆయోషామణి మీనాక్షికి సునాయాస ముగా బోధపడదు, లోని నానార్థదీపికయగు జ్ఞాన సూచిక. మీనాక్షి పుణ్యవతియగుటచే బోధపడక...

వినా: నీ విదివరకు ఉత్తరాలు వ్రాసేటప్పుడు అర్థం అయ్యే టట్టే వ్రాసేవాడవట. మీనాక్షి చెప్పింది. కాని యిప్పుడు అర్థం కాకుండా వ్రాయడంచేత ఒక పండి తుణ్ణిపెట్టి అర్థం చెప్పించుకోవలసి వచ్చిందట. ఆ పండితుడికి వాటి అర్థం చెప్పడానికి తలప్రాణం తోకకు వస్తున్నదట.

సింగ: పండిత ప్రకాండుల అఖండ విమర్శకాండతో నిండు అర్థము పింతుదురుగాక. మాటలో తేటు తెచ్చి హాయిగా దీటు చేయకు. ఓటిమాట మాటాడకు. నేను విజయపతాక ప్రతిష్ఠించి, వీరపరాక్రమాతిశయ ముతో వీరనారీమణి విడిదికి విచ్చేసి వీరలాంఛన సత్కారములతో విజయము నొందెదనని వివరింపుము వినాయకా!

వినా : అరే సింగారం! మీనాక్షి కి వ్రాసేఉత్తరాలు కొంచెం తెలిసేటట్టు వ్రాయి. అట్టహాసం హడావిడీ వద్దు. ఈ మాటలే నీతో చెప్పమన్నది. ఇది చాలా అవసరం.

బిచ్చ: స్వామీ ! ఏదైనా బిచ్చమెయ్యండిబాబూ !

వినా : నీ వక్కడికి పోయిరమ్మంటే పోలేదా. మా దగ్గర ఏమి తీసుకొంటావులే, పోయిరా !

బిచ్చ: ఒక అర్ధణా, కానీ...

సింగ : మట్ట మధ్యాహ్నపు ఎండలో నప్పనడివీధిలో ఉట్టి పడుతూ కొట్టుమిట్టాడుతూ గుట్టువిప్పిన పట్టమహిషీ! ఎట్టకేలకు కానిబొట్టు కోసము తిట్టెదవా? వాకిలి ముందు ఆకలితో కేకలువేయు ఓ కలికీ! ఇది నీ తప్పుకాదు; లోకముతప్పు. నిన్ను పెంచిన సంఘము తప్పు. చెవిటివాని చెవిలో శంఖం ఊదినట్లే పేదవారి రోదనల పెడచెవినిపెట్టిన పెంకిసంఘమా? ఆలోచించి చూడు; ఆదరించిచూడు! ఆనందంతో ఐశ్వర్యముతో అన్ని భోగాలూ అనుభవించే ఓభీత సంఘమా! నీ హృదయం విప్పి, నెమ్మదిగా ఒక్కక్షణం పరికించిచూడు—నీ యినుప పదాఘాతాలక్రింద నిరుపేద ప్రాణాలెన్ని కరిగి పోతున్నాయో ?

బిచ్చ: అయ్యా! మీరనేదేమిటి? ఈవేళ ఎవరి ముఖం చూశానోకాని ఏమీ దొరకలేదు.

వినా : అరే- బిచ్చకత్తె దగ్గరే ఇంత అదరగొట్టేశావే,

ఇంక ప్రేమలేఖలలో ఎంత కఠినభాష ఉపయోగించాలో!

బిచ్చు: వెళ్ళివస్తాను స్వామీ!

సింగ: వినాయకా! ధరిస్తాను పెన్; స్మరిస్తాను నా హృదయంలో రచనాపరంపర; వివరిస్తాను మీనాక్షికి; లిఖిస్తాను నా డెందము నందలి ఆనంద కందళిత —

వినా: అబ్బా! చాలురా; అలాగే వ్రాద్దువుగాని. ఆప్రం. ఇదొక ఖర్మ!

## మూడవ దృశ్యము

మీనాక్షి ఏడుస్తూంటుంది

జ్ఞానమ్: ఏమమ్మా ఏడుస్తున్నావు? ఏమండీ- మీనాక్షి ఏడుస్తూంది!

పర : సింగారమ్ ఎప్పుడు ఉత్తరాలు వ్రాయడం మొదలుపెట్టాడో అప్పటినించీ మీనాక్షీ ఏడుస్తూనే ఉంది. (నవ్వుతూ)

జ్ఞానం: మీనాక్షీ! నీమీద మనసుపడి నీ బావ నీకు ఉత్తరం వ్రాస్తున్నాడు. నీవెందుకు ఏడవడం?

మీనా: అమ్మా! అతని ఉత్తరాలు ఏమీ బోధపడటంలేదు.

పర :బోధపడలేదని బాధపడకు మీనాక్షీ! రైలుపట్టాల వంతెనమీద గూడ్సుబండి మార్చి చేస్తున్నట్టు టక్కా, టక్కా, టక్కా, టక్కా అనే తాళంతో నడుస్తుంది వాడి భాష.

మీనా: దానికి అర్థం తెలియటంలేదంటున్నాడు, మీరు పంపించిన గుమాస్తా...

పర: నిజంగానా? ఆ యబ్బాయి ఆ ప్రాంతంలో తెలుగు సంస్కృతాలు చక్కగా చదివాడు.

మీనా: అంతక్రితం వచ్చిన ఆరు ఉత్తరాలు తర్జుమా చేయడానికి అతనికి సాధ్యం కాలేదు.

జ్ఞానం: ఏమమ్మా! నీకు తెలుగు తెలియదా, మీ నాన్నగారికి తెలుగు తెలియదా? ఉత్తరంముక్క చదువుకొని అర్థం కాలేదంటే మీ చదువంతా ఎందుకని?

మీనా: నీవెందుకమ్మా నాన్నగారిమీద కోపపడతావు. సింగారంబావ వ్రాసింది చాల శృంగారంగా ఉన్న కారణంచేత...(మణ్యాం అక్కడకు ప్రవేశిస్తాడు.)

మణ్యాం: నమస్కారం.

పర: రండి! మిమ్మల్ని గురించే మీనాక్షి చెపుతోంది. సింగారం వ్రాసిన ఉత్తరాలు తర్జుమా చేయడానికి కొఱుకుబడటంలేదట.

మణ్యాం: కొంచెం కఠినంగానేఉన్నవి. యతిప్రాసలు, ఛేకానుప్రాసలాటానుప్రాసలూ వేసి శ్లేషార్థాలతో, కొంచెం-కష్టమే!

మీనా: కష్టమైనమాట అనేదానికి వారే ఇలాంటి డొంక తిరుగుడు సమాధానం చెప్పితే దీనికేమిటి అర్థం?

మణ్యాం: సులభమైన మాటలు దొరకలేదు, చాల కఠినమైన భాష, తర్జుమా చేయడం కష్టమని చెప్పుచున్నాడు అనువాదకుడు మణ్యాం.

మీనా: నాన్నగారూ! ఈయన పాండిత్య ప్రకర్షతో అను వాదం చేస్తే దానికి మళ్ళీ అనువాదం చేసుకోవలసి వచ్చేట్టుంది.

జ్ఞానం: ఏం తమ్ముడూ? నీవు చదివి వేరే ఉత్తరం వ్రాసి యివ్వడానికి వీలులేదా?

మణ్యాం: అలాగే చేస్తున్నానమ్మా! కాని కొన్ని కఠినమైన శబ్దాలు వచ్చి పడుతున్నాయి.

పర: ఆరు ఏడు ఉత్తరాలు అసలు చదివి చెప్పలేక పోయా వట? అయితే నీకీ దండగజీతం ఎందుకు?

మణ్యాం: చక్రబంధముగా చుట్టి చుట్టి వాక్యాలూ శబ్దాలూ వస్తున్నాయి. వాటి అర్థాలు తీసి, సులభంగా చెప్పడం కష్టమే!

మీనా: కష్టమో నష్టమో! ఇకమీదట ఉత్తరం వచ్చిన మూడు రోజులలో వాటిని అర్థంచేసి తేట తెనుగులో వ్రాసి నాకు అందజేసితీరాలి.

పర: విన్నావయ్యా మణ్యాం?

మణ్యాం: ఎన్నటికీ తమ విధేయుడు ఈ మణ్యాం – ఇదిగో వినాయకంగారు వస్తున్నారు.

పర: రావోయి వినాయకం! సింగారాన్ని చూశావా?

వినా: చెన్నపట్నంవెళ్ళి సింగారాన్ని చూశాను. వాడు మాటలాడే మాటలు నాకే అర్థంకాలేదు, అలాం టప్పుడు ఇంకెవ్వరికిమాత్రం బోధపడతాయి?

మీనా: (ఆత్రంతో) ఏమన్నాడో బావ?

వినా : అదే బోధపడలేదు. బిచ్చగత్తెకు బిచ్చంలేదు అనే మాట ఒక్క గంటనుంచి చెప్పాడు కాని...
జ్ఞానం: "లేదు - పోవే-శని!" అనడానికి ఒక గంటసేపు ఎలాగ చెప్పడం సాధ్యమవుతుందో? చిత్రం!
వినా: మీ యన్నగారబ్బాయితో చెప్పానమ్మా! నిజం. నీ ఉత్తరాలు కొంచెం తెలిసేటట్టు వ్రాయరాయని. మీనాక్షి చెప్పినట్టు చెప్పాను!
పర: ఈసారి వాడువ్రాసే ఉత్తరాలలో ఎలాగ ఉంటుందో చదివిచూద్దాం.
మీనా: మాటలకి అర్థమే ఈతనికి తెలియలేదు. ఇంకేమిటి?
పర: మిష్టర్ మణ్యం! మీరు ఈవేళ రేపట్లో అన్నీ తేట తెనుగున వ్రాసియివ్వాలి. 'మీనాక్షి వివాహం నిశ్చయం చేశారు. సింగారం నీకు సమ్మతమేనా? ఈ లెటర్ చూచిన రెండుగంటల లోపున బదులు వ్రాయాలి' ఇలాగ ఒక ఉత్తరం వ్రాయండి.
మీనా: నాన్నగారూ-ఇదేమిటి?
జ్ఞానం: నాన్నగారి అభిప్రాయం తెలియలేదా? ఉత్తరం తెచ్చి, వ్రాసి, టపాలో వేసిపంపెయ్యి.
మణ్యం: అయ్యా! నేను తెలిసేటట్టే వ్రాస్తాను. వ్యాఖ్యానంగా ఏమీ వ్రాయను. రిప్లైకార్డు వ్రాస్తాను.
జ్ఞానం: కార్డు మణికిచ్చి వేసి రమ్మనండి.
వినా: బాగుంది. మంచి ఐడియా. రిప్లైకార్డు వేస్తే. ఎక్కువగా వ్రాసిపంపడానికి వీలుండదు. పాటలూ మాటలూ వ్రాసేకవి సింగారం!

# నాలుగవ దృశ్యము

మీనా: అమ్మా!

జ్ఞానం: రిప్లైకార్డు తిరిగివచ్చిందా, సింగారం ఏమి వ్రాశాడు?

మీనా: రిప్లైకార్డులో దీనికి ప్రత్యుత్తరం పార్శిలుగా వేరే పంపిస్తాను. అది చూచుకోండి అని వ్రాశాడు.

జ్ఞానం: నిన్ను పెళ్ళిచేసుకొంటాను అంటాడా లేదంటాడా?

మీనా: ఇంతకుముందు టపాలో వచ్చిన ఉత్తరం వినాయకమూ నాన్నగారూ ఆ పండితుడూ ముగ్గురూ కలిసి ఒక్కొక్క-పుటా త్రిప్పి చదువుతున్నారు. ఇంకా పూర్తికాలేదు.

జ్ఞానం: సమ్మతమే అనిఒక్క-మాట వ్రాయడం వాడిచేత కాలేదా? ఏమి మనిషో ఈ సింగారం ...

మీనా: అమ్మా! ఆ గుమాస్తా చాలాఖచ్చితంగా మాటలాడ్తాడు. అలాగే వ్రాస్తాడు కూడాను. అతనంటే...

జ్ఞానం: నీ మనస్సులో ఎలాగుంటే అలాగ చెయ్యి-ఇలా గరా! రాబోయే ఉత్తరంలో...

వినా: ఏమయ్యా మణ్యం- ఇది పదొకొండవపుట. సింగారం జవాబు ఏమని యిచ్చాడో బోధపడలేదు. పెళ్ళి సమ్మతమేనా కాదా?

మణ్యం: పదొకొండవపేజీ చదువు తున్నాను. పూర్తిగా చదవనీయండి. అతని ఉత్తరంలో ఏమనిఉందంటే...

సింగ: 'పొంగిపొరలు పూర్ణచంద్రికా! నేను పులకాంకితుడనయి వివర్ణుడనై ముఖంలోని కళవళికలు పొందినాను. ఎప్పటికి సమయమగునోయని వేచి వేచి కొని

లేచి నీకోసము నిరీక్షించుచున్నాను. జాప్యమైన కారణముచేత, ఎన్నడో తినిన ఫలములు, భక్ష్యములు స్మృతిపథమున దోచుచున్నవి. నీ అప్పటితనము, ఇప్పటితనము చూచి ఎక్కడో విహరించుచున్న నా మనోవిహంగము రెక్కలార్చి ఎకసక్కెము చేయుచున్నది. చల్లని పిల్లతెమ్మెరలలో సాయంసంధ్యావీచికలలో మైకము కమ్ముచున్న పరిమళ వాయువులలో సన్నగా నున్నగా తారాడు పూదీవెలలో, ఆ పూదీవెల తావులలో మైమరచి విహరించే పిల్లగాలుల సన్నని సంగీతము వినకుతూహల మగుచున్నది. ఇప్పుడే చిగురించిన నా స్నేహలత పూలు కాడలుగా త్రుంచివేయలేదు. దుఃఖాంధకారములో...

పర: చాలు చాలు! ఇంతకీ సమ్మతమో కాదో తెలియనే లేదు. ఎవరది ? నీవా జ్ఞానం ?

జ్ఞానం: అవును. సింగారం వ్రాసిన ఉత్తరం పార్శిలు వచ్చిందటనే!

వినా : దానిమాటే చెప్తున్నాం. అది పుట పుటలుగా చదివి చూస్తూఉంటే పన్నెండవ పేజీవరకు వచ్చాం గాని ఇంకా ముగిసినట్టే లేదు.

పర: పన్నెండు పుటలయితే వ్రాశాడు కాని అందులో పెళ్ళి కిష్టమో లేదో చెప్పలేనివాడు, ఇంక ఏమి వ్రాస్తే ఏమిటి? ఉత్తరం తీసి అవతల పారవెయ్యి.

మణ్యా: ఇంక ఇరవై పేజీలదాకా చదివి చూద్దాం.

మీనా: ఇంకా ఇరవై పేజీలే! అమ్మయ్యో! ఎప్పటికి ముగింపు ?

పర: దీనికి నా ముగింపు వేరుగా చేస్తాను.

వినా: పరమశివన్ మామయ్యా! ఒకవేళ పెళ్ళి చేసుకోవడానికి సమ్మతమే అని చెప్పినప్పటికీ రేపు సింగారం చెప్పబోయే మాటలు అర్థం చేసుకొని తిరిగి తేట తెనుగులో చెప్పడానికి మణ్యంలాంటి వాడిని పంపిస్తారేమో! పూర్వకాలంలో రాజకుమార్తెలతో పాటు పండితుల్ని పంపించే పద్ధతిలో, మీఅమ్మాయి మీనాక్షితో ఒక అర్థం చెప్పే పండితుణ్ణి పంపవలసి ఉంటుందను కొంటున్నాను.

మీనా: నాన్నగారూ ? నేనొక నిశ్చయానికి వచ్చాను.

పర : చెప్పమ్మా చురుకుగా!

జ్ఞానం: ఆఁ! ఏమీ లేదు... అమ్మాయి, ఈ భాష అనువాదం చేసి తేట తెనుగులో చెప్తున్న అబ్బాయి లేడూ—అతనినే చేసుకొంటుందట. అతగాడు, తెలిసేటట్టు మాటలాడ్తాడు. వ్రాస్తాడు. చిక్కులేదు!

వినా : శభాష్ మీనా! చాలా చక్కని నిర్ణయం చేశావు.

పరమ: ఏమయ్యా— మణ్యం. మీనాక్షి అభిప్రాయం నీకు బోధపడిందా ? నీ అభిప్రాయం ఏమిటి ?

మణ్య: సిరిరామోకా లొడ్డుతానా ? చెఱకుగడ తినడానికి కూలికావాలా ?

జ్ఞానం: చూశారా! ఒక్కమాటలో జవాబుచెప్పే అల్లుడు

మాకుచాలు. సింగారం ముప్ఫైయొక్క పేజీలు వ్రాస్తే ఎవరు చదవగలరు ?

పరమ: మీనాక్షీ ! నీవు అదృష్టశాలివి. ఆ సింగారం వ్రాసిన ఉత్తరాలకట్ట అక్కడ చెత్తకాగితాల బుట్టలో పార వెయ్యండి. అల్లుడుగారూ- మణ్యంగారూ! మీరే మాయింటి అల్లుళ్ళు ... ఇంక ...

మణ్యా: విన్నావా మీనాక్షీ ! మీ నాన్నగారు చెప్పినట్లు చేయడానికి నాకూ అంగీకారమే!

[మీనాక్షి నవ్వుతుంది, సిగ్గుగా.]

వినా: మాటలు మార్చి తేటతెనుగు చేసే తేటతెనుగు మణ్యం-తన్నుతాను తేటతెల్లం చేసుకొన్నాడు !

[ తెర ]



# అల్లుడుగా రొస్తారు

రచయిత

యస్. రాఘవన్

తిరుచ్చి రేడియోలో రచయితగా పని చేస్తున్నారు. రేడియో నాటకాలు వ్రాయడంలో మంచి అనుభవం గడించిన ప్రఖ్యాత నాటక కర్త. పాటలు వ్రాయడంలో కూడ మంచి నేర్పరి. ఒక్కసారి ప్రసారంలో పేరు చెప్పిన వెంటనే కల్పనచేసి అప్పటి కప్పటికి రచన చేయగల సామర్థ్యము గలిగిన రచయిత.

## పాత్రలు

| | | |
|---|---|---|
| తండ్రి | — | మంగళమ్ |
| అల్లుడు | — | అంబుజమ్ |
| బాలు | — | మీనా |
| గాజులశెట్టి | — | జయ |



# అల్లుడు గారొస్తారు

## మొదటి దృశ్యము

మంగళం ఇల్లు. దీపావళికి ముందురోజు ఉదయం. ఇంటి వాకిలి గోడలు వెల్లవేసి అందంగా అలంకరించి ఉన్నట్టు కనిపిస్తుంది. మంగళం, పనిమనిషి మునియమ్మా కోను పిలుస్తూఉంది. అంబుజమ్మాళ్ అక్కడికి వస్తుంది.

మంగళం: అరరే! రా అమ్మా అంబుజం! నీవు వచ్చినది కూడ నేను గమనించలేదుసుమా! నాకు చెయ్యీ ఆడటంలేదు; కాలూ ఆడటంలేదు—ఇందులో దీపావళి ఒకటి వచ్చిపడింది.

అంబుజం: ఓ! దీపావళికి అల్లుడుగారొస్తారా! అదా సంగతి—ఇల్లూ వాడా పూర్తిగా దేవలోకంలాగ మారి పోయింది!

మంగ: అల్లుడు వస్తే, మంచిగా రావాలి, మంచిగా వెళ్ళాలి అని నా చిన్నతనంలో విన్నాను. ఇంతకాలమూ మా యింటాయన ఉద్యోగంలోనే ఉన్నారు. చేసే ఖర్చు చెప్పనక్కరలేకుండా పోయింది. ఇప్పుడు రిటైరయిపోయారు. ఉత్తచేతులు చూపిస్తే సరిపోతుందా; చెప్పు అంబుజం?

అంబు: ఏం చెప్పను అత్తయ్యా! మన కష్టం మనది. ఏది ఎలాగయినా మనం చేయవలసిన మర్యాదలు మనం చేయక తప్పదు.

మంగ: అలాగ చెప్పు! పిల్లగా ఉన్నప్పుడు చేయవలసినది పెద్దయినతర్వాతనైనా చెయ్యాలామరి? నీకు తెలియని విషయం ఏమున్నది? అంబుజం! ఏదో పిల్ల అదృష్టం. పెద్దయింటి సంబంధం దొరికింది. ఏదైనా లోపం చేశామంటే బాగుండదుచూడు! నిజానికి పైకి అల్లుడుగారు మహా ముక్కోపిలాగ కనిపిస్తారు. ఢామ్ ఢీమ్ అని పేచీ పెట్టితే ఎవరు తట్టుకోగలరు? (గర్వంగా) అతనికి ఢిల్లీలో పెద్ద ఉద్యోగంకదా! ఆఫీసులో ఎంతో ముమ్మరంగా పని ఉందట. దీపావళి ముందురోజుకి ఇక్కడికి రావడమే ఘనకార్యం! అంతా చక్కగా సజావుగా జరిగిపోవాలనే ఆత్రంతో నాకు ఏమీ తోచడంలేదు. ఏమీ జరగడంలేదు అంబుజం!

అంబు: అటయితే ఏవేంపనులు కావాలో అవన్నీ చూచుకో అత్తా! డబ్బు ఏర్పాటు అంతా చేసుకొన్నారా? బట్టలూ అవీ కొన్నారా?

మంగ: దానికోసమే ఆయనను బయటికి పంపించాను. పాపం! ఆయనకు ఇటువంటి విషయాలేమీ తెలియని అమాయకులు. అన్నీ నేనే స్వయంగా చూచుకోవాలి. అల్లుడుగారు రావడమూ రాకపోవడమూ అనేదానికి ఎంత భూకంపం అయిందో తెలుసా యింటిలో? పిల్లలు పసిపిల్లలు. వాళ్ళకేమీ తెలియదు. నాకు కాలూ చెయ్యీ ఆడకుండా ఉన్నది. అన్నిటికీ నీవు

కూడా ఉండి చేసోడు వాడోడుగా ఉండాలి అంబుజం!
అందుకే నిన్ను పిలిపించాను.

[బడబడమని అంబుజాన్ని లోపలికి తీసుకొనిపోతుంది.]

## రెండవ దృశ్యము

ఆవేళ పగలు. మంగళమ్ పనుల్లో మునిగి చురుకుగా అటూ ఇటూ పోతూ ఏదో తొందరలో ఉంటుంది. చటుక్కున రేడియో సెట్ జ్ఞాపకం వస్తుంది. అది రిపేరు చేసి తీసుకొని రమ్మని బాలూని తొందర పెట్తుంది. అతనిప్పుడు కాదు అంటాడు.

మంగళం: ఏమిరా ? అల్లుడుగారు వచ్చే సమయంలో ఎందుకురా ఇలాగ మూర్ఖపుపట్టు పట్టావు బాలూ !

బాలు: అల్లుడుగారికి సిల్కు బుష్కోటూ ట్వీడ్ సూటు నూ...

మంగ: అల్లుడుకి దీపావళిమతి !

బాలు: నాకుమాత్రం దీపావళి లేదా ?

మంగ: నీకు పంచలచాపు తీసి ఉంచానుకదా ! గుండంచు పంచె, జరీ రుమాలు, సాదా మల్లుచొక్కా- కొని ఉంచాను.

బాలు: కావిరంగు బట్టకూడ ఒకటి కొనిపెట్టు. కాషాయ వస్త్రాలు ధరించి జయ్ సీతారామ్ అని బయలు దేరుతాను.

మంగ: అదేమిట్రా-నిన్ను ఏదో చిన్నతనం చేసినట్లు మాటలాడతావేమిటి ?

బాలు: అవి తీసుకొనిపోయి పెంటకుప్పమీద పారవెయ్యి.

ఎవరికని చెప్తావు ? నీ యల్లుడుగారి బూట్ల వెల కూడ చేయని ఆ పంచెలచాపూ అవీ ఎవరికి కావాలి !

మంగ: (సమాధానంగా) కొంచెం ఓపికపట్టు. అంతగా అల్లుడు బెట్టు ప్రారంభిస్తే ఎక్కడినుంచి డబ్బు తెచ్చేది ?

బాలు: అల్లుడి కివ్వాలీ అంటే ఎక్కడనుంచి వస్తుంది డబ్బు? బంగారు గొలుసు, వాచి, రవ్వ ఉంగరం, ఫవుంటెన్ పెన్....

మంగ: మనకు లేకుండా అల్లుడిగారికి అతిశయ గౌరవం చేస్తామా ? మన కుటుంబ మర్యాద, గౌరవము, అంతస్థూ తగ్గకుండా చూడాలి ! ఉపకారంకోసం చేస్తున్నామా ? ఉన్నంతలో పొదుపు చెడకుండానే చేసుకొంటున్నాము మరి !

బాలు: (వేళాకోళంగా) అవునవును. దీవిటీ తగులవేసినచోట పొదుపు చేస్తూనే ఉన్నావు. ఖర్చు పెట్టవలసినచోట పెట్టూనే ఉన్నావు. అందుకోసం నాకు బ్లాక్ - అవుట్ చెయ్యాలా అని అడుగుతున్నాను. దుబారా లేకుండా నీ ధర్మము, నీ కుటుంబ మర్యాదా సాగుతుందా ?

మంగ: (రోషంతో) బాలూ ! నీవు దెబ్బలాట పెట్టకు. ఎంతెంత ఖర్చు అయిపోయింది ? వచ్చే సంవత్సరం దీపావళికి...

బాలు: అందలం ఎక్కించి ఏదో చేస్తాను, ఈపాటికి ఊరుకో అంటావు. అంతేనా ? ఇదిగో ! కన్నులు తుడవడానికి ఇలాంటి మాటలు చెప్పి పనిగడిపే వ్యాపారం నా

దగ్గర కట్టిపెట్టు. నాకుకూడా అతనికిచ్చినట్టే అన్నీ యివ్వాలి. లేకపోతే గాడామల్లు పంచెలూ అవీ ఆ యల్లుడు అల్లూరు సీతరామరాజు తలమీదనే కట్టి పెట్టు.

[బిడ బిడ లాడుతూ బయటికి పోతాడు. మంగళమ్ నోరు నొక్కుకుని నిలబడి పోతుంది. హాలులోకి దాన్ని మాష్టారును పంపించి ముఖం జేవురించినట్టు పెట్టుకొని మీనా లోపలికి వస్తుంది.]

మంగ: అయ్యో! ఇదేమిటే మీనా? ఇంకా తలవిరబోసుకొని అలాగ తిరుగుతూనే ఉన్నావా? ఇంకా తల దువ్వుకోలేదూ? కోసిఉంచిన పూవులన్నీ వాడి పోతున్నాయి.

మీనా: హు... పూవులెందుకు తే! పూవులు, పవుడర్, స్నో, హేర్ ఆయిల్-ఇవన్నీ మీ పెద్దమ్మాయి కిచ్చి ఆవిడ గారికి అర్చనచెయ్యి.

మంగ: నీవిలాగ నడచుకోవడం కొంచంకూడ బాగాలేదు.

మీనా: నీవు నడపించినది మాత్రం బాగాఉంది! పెద్దమ్మాయికి పట్టు జరీచీరె, నాకు పనికిరాని వట్టి నూలు చీర. ఆహాహా! నీకు మనస్సు ఎలాగ వచ్చిందో!

మంగ: అది పెళ్ళిఅయిన పిల్ల.

మీన: నేను పెళ్లికాబోయే పిల్లను. పెళ్ళిచేసిన పిల్లను విడచిపెట్టి, విడిగాఉన్న పిల్లనే ఎక్కువగా విమర్శిస్తారు; అది తెలుసుకో!

మంగ: అంత ధనవంతులయిన కుటుంబ సంబంధం చేశాము పెద్ద పిల్లకు. వియ్యంకుడూ వియ్యపరాలూ వార మ్మాయీ పని మనిషీ వీళ్ళంతా బయలుదేరి వస్తు న్నారట.

మీనా: అవును! ఇచ్చేవారుంటే పుచ్చుకొనేవారు ఒక దండ యాత్రకు బయలుదేరినట్టు పటాలంగా వచ్చి పడరూ? వాళ్ళ పనిమనిషి ఒంటికి జెంగుళూరు బనారసుచీరలు తప్ప వేరే పట్టవా ?

మంగ: వాళ్ళ అంతస్తుకి తగినట్టు మర్యాద చేయవలసిందే కదా !

మీనా: దానికోసం మనం అంతస్తు తక్కువ చేసుకొని క్రిందకి దిగజారి పోవాలా? (అసూయతో) ఈ అనవ సరమైన ఖర్చులకయ్యే సొమ్ముతో హాయిగా నాకు రెండు పేటల గొలుసు చేయించవచ్చునే!

మంగ: నగలకీ నట్రకీ చేతిలో సొమ్ము ఉంటేకదా ?

మీనా: లేకుండానే కొన్నావులాగుంది వజ్రమణిమాల నెక్లేసు ?

మంగ: వజ్రాలహారం పెట్టామని మనం వాగ్దానం చేశాంకదా? అప్పోసప్పోచేసి యెలాగో అతనిచేతఒప్పించి ఎలాగో అయిందనిపించేశారు. దానితర్వాత—భగవంతుని దయ వల్ల నెరవేరింది. నీకు సావకాశంగా నగలు చేయి స్తాము, దానికి ఎలాగ కుదురుతుంది? అది భర్త యింటికి రేపు కాపురానికి వెళ్ళబోయేపిల్ల.

మీనా: నేను పుట్టినింటిలోనే ఉండిపోయేదానిని ...

మంగ: చూడు మీనా ! అనవసరంగా అల్లరి పెట్టకు. అక్కా చెల్లెళ్ళలో ఇటువంటి వ్యత్యాసాలూ తారతమ్యాలూ పెట్టుకో కూడదమ్మా !

మీనా: (బ్రతిమాలుతూ) వ్యత్యాసం తెచ్చిపెట్టింది నీవే! దానిని గారాంచేసి, గౌరవించి, తలమీద పెట్టుకొని గొప్ప చేసేది-అంతా నీవే. అబ్బబ్బ ! ఎన్ని ఉపచారాలు ! ఎన్ని గొప్పలు ! కానీ- అది అదృష్టవంతురాలు, నేను దురదృష్ట వంతురాలని!

మంగ: అబ్బబ్బా ! ఈ పిల్లలకి మా స్థితిగతులు కొంచెం కూడ అర్థం కాకుండా ఉన్న వే! మునుపటిలాగ అనుకుని అల్లరీ అట్టహాసం చేస్తున్నారు. మేము ఏదో ధనవంతులమని గంపెడాశ పెట్టుకున్న వియ్యాలవారికి బదులు చెప్పేదా, వీళ్ళకి బదులు చెప్పేదా ? ఈశ్వరా! నాకు కాళ్ళూ చేతులూ ఆడకుండా ఉన్నవి. ...

# మూ డ వ దృ శ్య ము

ఆవేళ సాయంకాలం. మంగళమ్, ఆమె భర్తా కలిసి బిడ్డలను ఒక్కొక్కళ్ళనూ సమాధాన పరచాలని ప్రయత్నం చేస్తారు. అల్లుడుగారు వస్తారని ఇల్లు శోభాయమానంగా అలంకరించి ఉంటారు. గాజుల బేహారి వచ్చి కాచుకొని ఉంటాడు.

మంగ: (పిలుస్తున్నట్టు) జయా ! గాజుల శెట్టివచ్చి కనిపెట్టుకొని ఉన్నాడు. రా అమ్మా ! ఎన్నిసార్లు పిలిచేది ?

జయ: (వచ్చి) నాకు అక్కరలేదు. చెల్లాయికి కొనిపెట్టు.

మంగ: మంచిపనే! అల్లుడుగారు వచ్చేటప్పటికి మొండి చేతులతో ఉందామని చూస్తున్నావా? ఉత్త చేతులతో ఎలా గుంటావు— సుమంగళివి!

జయ: కావలసిన గాజులు నా ట్రంకులో ఉన్నవి. తీసుకొని వేసుకొంటే పోయె. అల్లుడుగారి పేరుచెప్పి నన్ను పెద్ద అట్టహాసం చేయవద్దు.

మంగ: ఆ పాతగాజులా నీవు చెప్పేది? అయ్యో! మీాయత్త గారు చూచినా భర్త చూచినా ఎంత హేళన చేస్తారు? ఇదేమిటి ఇటువంటి చీర కట్టిందేమిటి? ఈ వేషమేమిటి? ఆఫీసరుగారి భార్యలాగ జమ్మైన డ్రెస్ చేసుకొని దర్జాగా నిలుచోవద్దూ? ఇదంతా నే చెప్పాలా? మంచిపిల్లవే! అంబుజం, అంబుజం!...

అంబు: (లోపలనుండి) ఇదిగో వస్తున్నాను. అల్లుడుగారు వస్తే హారతి యివ్వడానికి కావలసిన యేర్పాట్లు అన్నీ చేసి వస్తున్నాను.

మంగ: అల్లుడుగారు రాగానే టిఫెన్, కాఫీ...

అంబు: అంతా రెడీ! అత్తా! మిగిలిన పనులన్నీ మీారు చూచుకోవాలి మరి.

మంగ: (చటుక్కున ఏదోజ్ఞాపకం తెచ్చుకొని) మునియమ్మా! మునియమ్మా!

జయ: కొబ్బరినూనె కొని తేవడానికి వెళ్లింది.

మంగ: అల్లుడిగారికేనా? కొబ్బరినూనె అంటే వాసనకు తలకు రాసుకొనే నూనె అని వివరంగా చెప్పి పంపిం

చావా? లేకపోతే దాని అలవాటు ప్రకారం పట్టి కొబ్బరినూనె తెచ్చి అల్లుడుగారి ముందు వచ్చి నిల బడుతుందేమో! ఇలాగేకదా; అప్పుడు పెళ్ళి చూపులకి వచ్చినప్పుడు, కాఫీ గిన్నెలకు బదులు ఏవో అంట్ల గిన్నెలు తీసుకొనివచ్చి నిలబడింది! (ఏదో అనుకొంటూ లోపలికి వెళ్ళిపోతుంది) పూలమ్మి రోజా పూలదండ తెచ్చిందా? ఏమే తల్లీ మీనా! నాకు కాళ్ళూ చేతులూ ఆడకుండా ఉన్నవే...!

[బాలూ సైకిలుమీదవచ్చి అల్లుడుగారి రాక గురించి చెప్తాడు. మీన, జయ, మంగళమ్, అంబుజమ్- అందరూ వీధిలోనే చుట్టవేసి లెక్కలేని ప్రశ్నలతో అతనిని ముంచెత్తుతారు.]

మంగ: ఏమయిందిరా నాయనా? అల్లుడుగారు వచ్చారా లేదా!

బాలు: (విసుగుగా) అదెందుకు అడుగుతావు? ఆయన రావడం తోనే కోపంతో వచ్చి కూర్చున్నారు. దిగీ దిగడం తోనే అలుక పాన్పుమీదకూర్చున్నాడులే! మొదట్లో అతగాడు నాన్నగారికి వ్రాసిన ధోరణి యింకా విడిచి పెట్టలేదు. నేను...

మంగ: (ఆత్రంతో) అయ్యయ్యో! ఏంకోపమో ఎందుకో తెలియలేదా? మనం ధనవంతులం కామని గుట్టు తెలిసి పోయిందో ఏమో! ఏం జయా! మాటి మాటికీ ఇలాగ పట్టరాని కోపం వస్తుందా; లేక వజ్రాల హారమూ వజ్రపు ఉంగరమూ ఇవ్వడం ఆలస్యమయిందని ఆగ్రహమా?

జయ: ఏమిటో! పాడుకోపం! నాకు తెలియదు.

మీనా: అల్లుడు గారు వస్తారని విన్నా...

బాలు: మొదలు పెట్టావా?

మంగ: (ముఖం తుడుచుకొని) ఇదుగో నర్రా, మీనా! బాలూ! మీరిద్దరూ నోరు మూసుకొని కొంచెం ఊరుకోండి-నాకేమీ పాలుపోవడం లేదు, కాళ్లూ చేతులూ ఆడడం లేదు.

మీనా: డబ్బు మాత్రం ఆడి పోతో ఉంది!

బాలు: అతనేదో చిత్రమైన మనిషిలాగ కనిపిస్తున్నాడు. అబ్బబ్బా! అతని పెంకితనమూ బెట్టుసరీ... కారక్కర లేదు. బస్సులోనే వస్తాను అన్నాడు. చివరికి ఎలాగో కారులోనే ఎక్కించి తీసుకొని వచ్చాము. మరో విషయం విన్నావా ? అల్లుడుగా రొక్కడే వచ్చి ఊరుకొన్నాడు.

మంగ: (తిప్పుకొంటూ) ఏమిటి? వియ్యాలవారు అందరూ రాలేదా? ఏంప్లాను వేసి పిల్లవాడిని మాత్రం పంపి ఊరుకొన్నారో?

మీనా: అయితే వాళ్ళకోసం ప్రత్యేకంగా కొన్న డ్రెస్సులు, ప్రెజెంట్సు— ఇవన్నీ?

మంగ: (గద్గద స్వరంతో) మీనా! బాలూ! దయచేసి మీరిద్దరూ మాటలాడకుండా ఉండండి, పుణ్యముంటుంది. నాతల తిరిగి పోతున్నది. నామెదడు బెదరి పోతున్నది.

బాలు: (నవ్వుతూ) నీవుకొన్న ప్రెజెంటేషన్ సామాన్లుకూడా బెదరిపోతూ వున్నవి.

[బయట కారుశబ్దంవినిపిస్తుంది. అందరూవీధిలోకి పరుగెత్తుతారు. దీపావళి నాటి గంగాస్నానం పూర్తి అవుతుంది. రేడియోలోని సంగీతం పరవశం చేస్తూఉండే స్థాయి నందుకొంటుంది. లోపల దీపాలుపెట్టి వెలిగిస్తారు. బట్టలు, పంచెలు, చీరెలు, కొబ్బరికాయలు, పండు, ఫలహారాలు- ఇవన్నీ అక్కడ పెట్టి ఉంటాయి.]

తండ్రి: (మెల్లిగా) బాలు! ముందుచేసిన ఏర్పాటు ప్రకారము, ఒక్కొక్కళ్ళూ వచ్చి ప్రజెంట్సు తీసుకోండి. మీనాతో కూడా చెప్పు. మీ రిక్కడికి వచ్చి, పగతో ఆ మాటలూ ఈ మాటలూ చెప్పకుండా ఎవళ్ళవి వాళ్ళు తీసుకోండి.

మంగ: (తలుపుచాటున నిలుచుండి) సరేలెండి. మీరు వెళ్ళండి. మొదట్లో మీ ఆశీర్వాదం పూర్తి చేయండి. అలాగ యిలాగని అపశబ్దాలూ అవీ ఏమైనా అంటారో ఏమిటో; అలాంటివేమీ అనకండి!

[అల్లుడుగారు మెల్లిగా వచ్చి ప్రక్కగా కూర్చుంటాడు. గప్‌చిప్‌మని నిశ్శబ్దంగా అయిపోతుంది అంతా]

తండ్రి: (గొంతుక సవరించుకొని మెల్లిగా) ఏదో గంగాస్నానం మంగళంగా పూర్తి అయింది. అల్లుడుగారూ! మీ అంతస్థుకి తగినట్లు మేము మర్యాద చేయడానికి వీలులేదు. అయినప్పటికీ ఇదే గొప్పగా

భావించుకోవాలి. ఇదిగో తీసుకోండి మరి– చంద్రుడికి ఒక నూలుపోగు.

[వెండిపళ్ళెములోని బహుమతులు అల్లుడుగారికి అందచేస్తాడు.]

అల్లుడు: (అవన్నీ చూచి) ఇవన్నీ యేమిటి? సిల్కు బుష్ కోటు, ట్వీడ్ సూట్, హ్యాట్, బూట్సు, టూటాల్ టై ...

బాలు: ఇదిగో నా ప్రజెంటేషన్. (ఇంకో వెండిపళ్లెములో బహుమానాలు అందిస్తాడు.) వజ్రపు ఉంగరము.

అల్లుడు: ఇచ్చివేసినట్లేనా? ఇంకేమైనా ఉన్నాయా?

తండ్రి: (వినయముతో) తీసుకో నాయనా!

మీనా: (ఒక పొట్లాం తెచ్చి యిస్తూ) నావల్ల సాధ్యమైనవి యివి– చిలుకలు, బెలూన్లు, తంజావూరు బొమ్మలు, పట్టుటోపీ...

బాలు: చిన్నపిల్లవాడు అనుకొన్నావా బావ ఇవి తెచ్చావు? అల్లుడుగారూ! ముందుపుట్టబోయే పాపాయికి ఇప్పుడే ప్రజెంటు!

[అందరూ నవ్వుకొంటారు]

మంగ: (లోపలనుండి పళ్ళు కొరుకుతూ) ఈ పిల్లలు సమయ సందర్భాలు తెలియకుండా వేళాకోళం చేస్తారు. చిన్న కుక్కపిల్లల్ని తలమీద పెట్టుకొన్నట్టే...

అల్లుడు: (అంగీకరిస్తూ) ఇదంతా నాకు చేసే రాజోపచారాలు. (అసంతృప్తి) ఇంతేనా? ఇంకేమైనా ఉన్నదా?

తండ్రి: (క్రిందికిదిగి) ఏదో మావల్ల సాధ్యమయింది ఇంత

వరకు మాత్రమే. అందరి దగ్గిరా తీసుకుని అలాగే పెట్టేశారే. ఎందుకు మా మీద కోపం ?

మంగ: (తలుపుచాటునుంచిసాగి) మీరు కోపం తాపంచేస్తే మేము తట్టుకోలేము అని చెప్పండి. నోరు లేదని ఏదైనా అడిగితే మేము—

తండ్రి: అదే నేను చెప్పేదిన్నీ... హి హి హి. ...

మంగ: హిహిహి అంటేకాదు. మర్మం లేకుండా సరిగా చెప్పండి. నాకు కాలూ చేతులూ ఆడడం లేదు.

అల్లుడు: (అలుకతో) ఇందుకోసమేనా ఇంతదూరం పనిగట్టుకొని వచ్చాను. హుఁ!

తండ్రి: (తలుపుప్రక్క ఒకకన్నూ అల్లుడుమీద ఒకకన్నూ వేసి) మీరు రావడమే మా భాగ్యం! ఏదైనా లోపముంటే—

అల్లుడు: లోపమేముంది లోపం ? ఇలాగ చేస్తారు అంటే నేనంత దూరంనుండి రాకనేపోదును. గంగాస్నానం చేయడానికి గంగాతీరం విడిచిపెట్టి కావేరీతీరం వచ్చినందుకు మంచిపనే అయింది!

మంగ: (భర్తతో) ఎందుకు ? మేము మీ కోరిక నెరవేర్చడానికి సిద్ధంగా ఉన్నామని చెప్పండీ!

అల్లుడు: నాకేది యిష్టమో మీకెలాగ తెలిసింది? సిల్కూ, లినెన్ట్వీడ్, టూట్వాల్ కోటు, సూటు, టై! ఒక్కొక రంగులో రెండు జతలు! నాకు రెండు జతల శరీరమున్నదనుకొన్నారా ? నేను ఎల్లప్పుడూ పంట్లాం వేసుకొని కూర్చుంటున్నాను. ఈ దీపావళి మంగళసమయంలో,

కూడ దొరవేషమేనా ? ఎప్పుడు ఆ వేషం అంతా తీసి పారవేస్తాను, ప్రత్తినూలుతో నేసిన నేతపంచె కట్టుకొని, పైన అంగవస్త్రం (ఖండువా) ఎప్పుడు వేసుకొంటానా అని ఎదురుచూస్తూ ఉన్నానే; తీరా వస్తే ఇవా బట్టలు? మంచికాలమే! నేతబట్టలూ, పంచెలూ వదలి....

బాలు: (గుర్తుబట్టి) నేతచాపులూ బట్టలూ వేసుకోవడానికి మే మున్నాములెండి అల్లుడుగారూ !

అల్లుడు: (అందరినీ ఆశ్చర్య చకితుల్ని చేసి) మామగారూ ! ఇవన్నీ మా బావమరది కిచ్చివెయ్యండి. అతని కని తెచ్చిన పంచెలచాపూ, పై ఖండువా నాకు కావాలి.

మంగ: అయితే ఆయనకు వేరే మంచి పంచెలచాపులు కొందామని చెప్పండి.

తండ్రి: మరే! మీకు వేరే మంచిరకం పంచెలచాపూ అవీ చూచి...

అల్లుడు: ఇంతకంటే మంచిరకం ఏముంది, డబ్బు ఖర్చుపెట్ట డానికి తప్ప? డబ్బు ఖర్చుపెట్టాలనే కదా యీ వజ్రాలహారం, ఈ రవ్వ ఉంగరం ఇవన్నీ పెట్టి....

తండ్రి: ఇవన్నీ మీ కోసమే కదా ?

అల్లుడు: నాకా ? ముందే నేనొక వాచీ పెట్టుకొన్నాను కదా ?

బాలు: ఇదికూడ పెట్టుకోండి అల్లుడుగారూ!

అల్లుడు: ఓ ! రెండు చేతులకీ రెండు వాచీలు పెట్టుకో మంటారా ? భేష్ ! సోమరిపోతు జామాత ననుకుంటు

న్నారా? నీకు వాచీ లేదుగా బాలూ! ఇలాగరా! నీకు పెట్తాను. ఈ వజ్రపు ఉంగరంకూడ నీకే. నేను ఉంగరం పెట్టుకోవడం అలవాటులేదు. (బాలు వద్దంటూ ఉన్నా విడువకుండా అతని చేతికి వాచీ ఉంగరమూ బలవంతంగా పెట్తాడు.) జయకు ఇప్పుడు వజ్రాలహారం ఎవరు చేయించమని అడిగారు? మీనాకు ముక్కుపుడకపాడికూడా లేదు! అడిగితే అదొక ఫాషన్ అంటారు. (జయతో) ఏమే జయా? నీవుకూడా ఈ నాటకంలోచేరి అడిస్తూన్నావా?

జయ: (మృదువైన కంఠస్వరంతో)వద్దన్నా వినక వీళ్ళంతా పడినపాట్లివి! ఏం చెయ్యమంటారు?

మంగ: జయకు పెట్తామని వాగ్దానం చేశాము, పెళ్ళి సమయంలో...

తండ్రి: (పరామర్శిస్తూ) ఏదో దీపావళి పండుగ సందర్భంలో మీకు సంతోషంగా ఉండాలని...

అల్లుడు: అల్లుడుగారి సంతోషం కోసమేనా పండుగ యేర్పడింది! పండుగ అందరి సంతోషం కోసమూ ఏర్పడింది. కష్టంతో సమకూర్చిన సంతోషం ఒక్కనాటికి కూడా నిలవదు. ఇంత ఆడంబరంగా ఇన్ని కొనడానికీ ఖర్చుపెట్టడానికీ ఎంత కష్టబడ్డారో! నిజమైన సంతోషము ఆడంబరంలో లేదు. తృప్తిలోనే ఉంది ఆనందము. సులభంగా అల్పసంతుష్టితో ఉండేచోట ఆడంబరంతో అట్టహాసం చేసే ఏమి వసుంది?

తండ్రి: (లేచి అల్లుడు గారి చేతులు పట్టుకోని తడుముతూ) అల్లుడుగారూ! మీమనస్సు తెలుసుకోలేక ఎన్నోతప్పి దుగా చేసివేశాం. మీరే మమ్మల్ని మన్నించాలి!

అల్లుడు: (మనసు కరగి) అయ్యయ్యో! మామగారూ! అలాగ ఎన్నడూ అనకండి. నిజానికి మీ సంతోషం కోసమే ఇంతదూరం పనికట్టుకోని వచ్చాను.

తండ్రి: (గొంతుకలోని గాద్గదికతో ఆనంద బాష్పాలు విడుస్తూ) నాయనా! ఇప్పుడే నిజంగా నా మన స్సులో ఆనందం పొంగి పొరలి వస్తూంది.

మంగ: (ఆనంద బాష్పాలతో అంబుజంతో) పెద్దయింటి అల్లుడు. అతని మనస్సు తెలియక అల్పబుద్ధితో మన మేమేమో చేశాం. (జయను చూచి) జయా! నీ దాంపత్య జీవనం సుఖంగా ఉండాలని ఎంత ఖర్చు అయినా లెక్క-పెట్టకుండా వెచ్చించాలని సొమ్ము దాచి ఉంచాను. ఆ సోమ్ముతో నీ దాంపత్య సుఖం కొందామనుకొన్నాను. కాని అల్లుడుగారి గుణగణాలు వెల యిచ్చి కొనడానికి వీలులేని అమూల్యమైన మాణి క్యాలు. నాకిప్పుడు కలిగిన ఆనందంలో...

బాలు: (అక్కడికి వచ్చి) కాళ్ళూ చేతులూ ఆడకుండా ఉన్నవి.

అందరూ నవ్వుకొంటూఉండగే తెర కిందికి వాలిపోతుంది

స మా ప్తం

